# శ్రీనాథుఁడు

△

రచన

కాపాలి

ప్రచురణ

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,

సంస్కృతాంధ్ర గ్రంథాలయం, ( స్థా 1882 ) రాజమండ్రి.

# విషయసూచిక

# శ్రీనాథుఁడు

ఆంధ్రభాషామతల్లికి అనేక రత్నములు యేర్చికూర్చి యిచ్చిన వారిలో చేరిన మహనీయుడే శ్రీనాథుడు. యితని కవితాధార గ్రోలి పెక్కు పండితులు, మహారాజులు, శృంగార శ్రీనాథ కవిసార్వభౌమ మున్నగు బిరుదులిచ్చి ధన్యులైరి. ఈ కవిశేఖరుడు పాకనాటినియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంభసూత్రుడు. భారద్వాజ సగోత్రుడు.

భీమేశ్వరపురాణ మంకితము గొన్న బెండపూడి అన్నమాత్యుడు యీ కవిసార్వభౌముని గూర్చి యిట్లు పలికియున్నాడు.

పాకనాటింటివాడవు బాంధవుఁడవు
కమలనాథుని మనుమఁడ విమలమతివి.

దీనివలన శ్రీనాథుడు కమలనాథునకు పౌత్రుడనియు, యీతని తండ్రి మారయ్య, తల్లి భీమాంబ.

హరవిలాసమను వై ప్రబంధమున తన జననీజనకుల నామంబులిట్లు పేర్కొనియుండెను.

సీ. కమలనాథుని పౌత్రుఁడ గవితా మహారాజ్య
భద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ

భాత్రు నాపస్తంబసూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్రు( గులపవిత్రు
భీమాంబికా మారయామాత్యు నందను
నఖిల పురాణ విద్యా ప్రవీణు
అధ్వర్యు వేద శాఖాతిథినిష్ఠాత్ము
నాంధ్రభాషా నైషదాబ్జ భవుని
తే. గీ. యుభయభాషా కవిత్వ ప్రయోగ కుశలు
బాలసఖు గారవించి తాత్పర్యమొప్ప
నవచి దేవయ త్రిపురారి యక్షరాజు
హితమితోక్తులు వెలయంగ నిట్టు లనియె.

ఇదియుగాక శివరాత్రి మహాత్మ్యము, శృంగార నైషధము మున్నగు గ్రంథములయందు గూడా తన తల్లిదండ్రుల నామములు, తాతగారి నామమును శ్రీనాథుడు స్వహస్తముతో వ్రాసికొనియుండగ కొందఱు "అమరామాత్యుడు శ్రీనాథకవి తండ్రి" యని నుడువుచుండిరి. ఇట్లనుటకు వారి కే యాధారములు దొరికెనో తెలియకున్నది.

ఇతడు శైవుడైన పాకనాటినియోగి బ్రాహ్మణు(డు. ఈ యంశమును తన భీమఖండములో చెప్పియున్నాడు. బెండపూడి అన్నామాత్యుడు యిట్లు నుడివియున్నాడు.

సీ. వినిపించినా(డవు వేమభూపాలున
కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినా(డవు గాఢపాకంబైన
హర్షనైషధ కావ్య మాంధ్రభాష

భాషించినాఁడవు బహుదేశ బుధులతో
విద్యా పరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగనములందు
గీ. పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమ డమలమతివి
నాకు కృపచేయు మొక ప్రబంధంబు నీవు
కవిత గుణగణ్య శ్రీనాథ కవివరేణ్య !

## పాకనాటిసీమ

గుంటూరుమండలములోని "కొండవీడు" మొదలుకొని నెల్లూరు మండలమందలి "కందుకూరు" వరకును పాకనాటి సీమ యని పెద్దన్న యభిప్రాయము.

ఈతని తాతయగు కమలనాభుడు గొప్ప పండితుడు, కవియును. పద్మపురాణ మాంధ్రీకరించెను. కమలనాభామాత్యుడు, పాకనాటిసీమలోని కాల్పట్టణమందు నివసించువాడని యీ క్రింది పద్యము చెప్పుచున్నది. కాల్పట్టణ మిప్పుడెచ్చట నున్నదో తెలియదు. సముద్రగర్భమున లీనమైపోయినదో లేక మారుపేరు ధరించేయున్నదో యెవ్వరు చెప్పజాలకయుండిరి.

మ. కనకక్ష్మాధరధీరు వారధితటి కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణసంగ్రహం కళాకావ్య ప్రబంధాదిపున్
వినుమద్యాంతర సార్వభౌము గవితా విద్యాధరుం గొల్తునా
యనుగుందాతబ్రదాత శ్రీకమలనాభ అమాత్యచూడామణిన్,

శ్రీనాథుడు తన తాతను బొగడినట్లుగా తండ్రిని బొగడ లేదు. అందుచే శ్రీనాథుని తండ్రి పండితపుత్రు డగునేమో యని పలువు రభిప్రాయపడుచున్నారు.

## శ్రీ నాథుని జననకాల నిర్ణయము

శ్రీనాథుడు ఎప్పుడు జన్మించినది. తగిన యాధారము లభించుటలేదు. ఇంచుమించుగా 1365 సంవత్సరము 1380వ సం వత్సరముల మధ్య జన్మించి యుండవచ్చునని నా యభిప్రాయము.

రావుబహాదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారి యభిప్రాయము :— హరవిలాసము గృతిపొందిన త్రిపురాంతకుని సోదరుడగు తిరుమలనాదసెట్టి, పిరోజిషహా, కుమారగిరిరెడ్డి, హరహరరాయలు రాజ్యమేలుచుండగా కుమారగిరిరెడ్డి వసంత వైభవములు నిర్వర్తించువాడని హరవిలాసమున యీ క్రింది పద్యములలో చెప్పబడియున్నది.

చ. హరిహరా ఫిరోజి సహసురథానగ జాండిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణనచేయు గుమారగిర్యధీ
శ్వరుని వసంత వైభవము సర్వము నొక్కడు నిర్వహించు మా
తిరుమలనాథ సెట్టికిన్ ధీగుణ భట్టికి నెవ్వరీడగున్.

పైరాజులు మువ్వురు జీవించియుండగనే హరవిలాసము రచింపబడి యుండవచ్చును. తరువాతనే యీ రాజులు మువ్వు రును 1400 సం॥ లోపుగనే గతించిరి. పై కారణములుబట్టి

యూహింపగా శ్రీనాథుని జననము 1370–1375 లోపున నయి యుండవచ్చును.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము:– శ్రీనాథుడించుమించుగా 1375–80 సంవత్సరముల లోపున జన్మించి యుండవచ్చునని వ్రాసిరి.

శ్రీ కూనవల్లి లక్ష్మీనరసయ్యగారి యభిప్రాయము :— 1375–80 లోపుననే జన్మించినట్లు వ్రాసియున్నారు.

## రెడ్డిరాజుల వృత్తాంతము.

శ్రీనాథుని చరిత్రమును వ్రాయునప్పు డాకవిని పోషించిన యల్లాడ వేమభూపాల వీరభద్రారెడ్డుల చరిత్రమించుక వ్రాయుట సమంజసము కావుని వారి చరిత్రమిందుఁ గొంచెపఱకుఁ బొందు పఱుపక తప్పదు.

అల్లాడరెడ్డియను నాతఁడు కొండవీడు రాజదానిగాఁ జేసికొని కొండవీటి రాజ్యము నేలుచుండెను. అనపోతరెడ్డి కుమార్తెయగు వేమాంబయను నామె నల్లారెడ్డికిచ్చి వివాహమొనర్చిరి. ఆ కారణము వలన నాతనికి రాజమహేంద్రవర రాజ్యము లభించెను. అనపోతరెడ్డికిఁ గుమారగిరిరెడ్డి యనునొక కుమారుఁడుండెను. ఈతఁడు వేమాంబకుఁ దమ్ముఁడు. అల్లారెడ్డికి వేమాంబయందు వేమారెడ్డి (వేమాభూపాలుఁడు) వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, నన్నయరెడ్డి యను నలుగురు పుత్రులుదయించిరి. అల్లాడరెడ్డికిఁ దఱువాత వేమారెడ్డియు వీరభద్రారెడ్డియు రాజ్య

మును బాలించిరి. వేమారెడ్డి కొండవీఁడు రాజధానిగాను, వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరము రాజధానిగాను జేసుకొని రాజ్యముం బాలించినట్లు గ్రంథములవలనఁ దెలియుచున్నది. అల్లాడ రెడ్డి మొదట రాజమహేంద్రవరము రాజధానిగా రాజ్యమేలినట్లే యగుపడుచున్నది. తరువాత వీరభద్రారెడ్డి కాలములోఁ గొండవీటి రాజ్యము కుమారగిరిరెడ్డి పరిపాలించెను. కుమారగిరిరెడ్డికిఁ బిమ్మటఁ గోమటి వెంకారెడ్డి కొండవీటి రాజ్యమును బరిపాలించెను. కొండవీటి పాకనాటి రెడ్లతో సంబంధ బాంధవ్యము కలిగినందున నల్లాడ భూపతికి రాజ్యము లభించినట్లు గ్రంథముల వలనం దేలుచున్నది. కాని కొండవీటిరాజ్య మల్లాడరెడ్డి కెట్లు వచ్చినదో, కొండవీఁడు విడిచి రాజమహేంద్రవరమున నల్లాడ రెడ్డి తన రాజధాని నెందుకు మార్చుకొనెనో వేమారెడ్డి మరలఁ గొండవీఁడు రాజధానిగా నేల చేసికొనెనో, వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరము నేల రాజధానిగా నేర్పాటుగావించుకొనెనో తెలిసికొనుటకు దగిన యాధారము లెవ్వియుం గానరావు.

భీమఖండమునందు :—

వ—కీర్తివిహార ఘంటాపథంబైన పంట మహాన్వయంబునఁ బాఁకనాఁటి దేశంబున భద్రపీఠంబున నది వసించిన ........ప్రోలయాన్న వేమాన్న ప్రోతాల్లవేమ కుమారగిరీశ్వరాదుల........సంబంధ బాంధవ్యంబున వసుంధరాభార ధౌరంధర్యంబునంది.........అల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతంబు....పాలించెఁ దదనంతరంబ.

శ్రీ నా థుఁ డు

తే. రాజరఘురాము లల్లాడ రమణసుతులు
ధాత్రిఁ బాలింతు రాజమహేంద్ర తారకముగ
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హరియును హరుఁడుఁ బోలె.

ఉ. తమ్ముని వీరభద్ర వసుధాధిపు విక్రమ వీరభద్రునిన్
సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముఁగట్టి బాహుద
ర్పమ్మున వేమ భూవరుఁడు వ్రాసె జగద్విజయ ప్రశస్తి వ
ర్ణమ్ములు దిగ్ధురంధర సురద్విపకుంభ విశాల మండలిన్.

కాశీఖండమునందు :—

 మ. అనవేమ క్షితిపాల పౌత్రియగు వేమాంబా మహాదేవికిన్
ఘనుఁడ య్యల్లడ భూమిపాలునకు సంగ్రామస్థలీ గాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరభద్ర క్ష్మానాథుండు దొడ్డప్రభుం
డును సన్నయ్యయు నాగ [illegible] ప్రతాపోద్ధతుల్.

బెండపూడి యన్నయ్యయును నాగయ వేమభూపాలు నకును, వీరభద్రభూపాలునకును గూడ మంత్రిగా నుండినట్లు క్రింద భీమఖండము నందలి పద్యము వలనం దేట పడుచున్నది.

సీ. ధారాసురత్రాణ ధాటీ సమారంభ
గర్వపాథోరాశి కలశజులకు
సప్తమాడియు రాయమాడి యశోయుల
వందిత శ్రీపాద వనరుహులకు
సింహాద్రి పర్యంత సేమాంధ్ర మేదినీ
మండలీ పాలనా ఖండలులకు
హరిదంత దంతి దంతావళీ లిఖ్యమా
నానేక జయశాస నాక్షరులకు

తే. గీ. వీరభద్రేశ వేమప్ప ధీవిధవులకు
నను(గుమంత్రి మహాప్రధా నాగ్రగణ్యు
బెండపూడన్న జగనబ్బ గండబిరుద
సచివదేవేంద్రుఁ గృతికథీ శ్వరునిఁజేసె.

వేమారెడ్డి భూదానము లెన్నియో యొసర్చినట్లుఁ గూడ శ్రీనాథుఁడు తన భీమఖండమునందలి యీ దిగువ పద్యమునందు వక్కాణించి యున్నాడు.

క. కాంచీ శ్రీగిరి కాశీ
పంచారామాది దేవ భవనంబుల బ్రా
యించెను వేమ క్ష్మాపతి
యంచిత భూదాన శాస నాంక్షర పంక్తుల్.

వీరభద్రారెడ్డి శ్రీనాథునిచేఁ గాశీఖండమును రచియింపం జేసి కృతినందెను. ఈ వీరభద్రారెడ్డి రాజ్యము రాజమహేంద్ర వరము మొదలుకొని చిల్కాసముద్రము వఱకు వ్యాపించి యుండి నట్లు నీ క్రింద వ్రాయబడిన కాశీఖండములోని పద్యము వలనం దేటపడుచున్నయది.

ఉ. ప్రాకట విక్రమ స్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేక సితాత పత్రముగ నేలును వీరనృపాలుఁడుత్తమ
శ్లోకుఁడు వేమశౌరి యనుజుండు సమున్నత వైభవాఢ్యుఁడై
చీకటియుణ్ గళింగమును జిల్కాసముద్రము సింహశైలముణ్

## దేశటి పోలయ వేమారెడ్డి

ఈతఁడు దేశటి వేమారెడ్డి మనుమఁడు. తండ్రి పోలయ రెడ్డి. శౌర్యపరాక్రమ సంపన్నుఁడగు నీతఁడు క్రీ. శ. ౧౩౨౪ వ సంవత్సరము మొదలు ౧౩౫౦ వఱకు రాజ్యపాలనముఁ జేసెను. మహమ్మదీయులను జయించి, రాజ్యము పెంపొంద జేయుటలో మిక్కిలి పాటుపడెను. అద్దంకి యీతని రాజధాని నగరమై యుండెను. ఈతనికి జగనొబ్బగండఁడు, సంగ్రామధనంజయుఁడు, మండలీకరగండడు, అపరిమితభూదాన పరశురాముఁడు, అనేక నగరోపకంఠ ప్రతిపాదిత బహువిధాభి రాముఁడు, ప్రజ్ఞాచతుర్వేధోపాయుఁడు మున్నగాఁగల బిరుదము లెన్నో కలవు. ఇతనికి రామాప్రెగ్గడ మంత్రిగా నుండెను.

అన్నారెడ్డి, మల్లారెడ్డి అనువార లీతని సహోదరులు. అనపోతారెడ్డి యీ వేమారెడ్డి కుమారుఁడు. అనపోతారెడ్డి ప్రసిద్ధ సేనానియై ధరణికోటలో నివసించుచుండెను. ఈ వేమారెడ్డి రాజ్యము నెల్లూరు మొదలు గోదావరినదివఱకు వ్యాప్తమై యుండెను. ఈతఁడు ౧౩౫౦వ సంవత్సరము వఱకు రాజ్యము పాలించెను. ఎఱ్ఱాప్రెగ్గడ విరచించిన హరివంశము, రామాయణము నను రెండు కావ్యములను నీత దంకితము గైకొనెను.

## అనపోతారెడ్డి

ఈతడు క్రీ. శ. ౧౩౫౦వ సంవత్సరమున సింహాసనము నధిష్టించెను. వేమభూపాలునకీ యనపోతారెడ్డియే గాక అనవేమారెడ్డి, కోమటిరెడ్డి యను పుత్రులును, దొడ్డాంబిక, వేమాంబిక

యను నిర్వురు పుత్రికలును గలరు. కోమటరెడ్డి బాల్యముననే బరలోకగతుఁ డయ్యెను. కాటయరెడ్డికి దొడ్డాంబయను, వల్ల నూకయరెడ్డికి వేమాంబయు బెండ్లి చేయబడిరి. ఈ యిరువురును అనపోతారెడ్డికి సేనానులై వాసిఁ గాంచిరి. సోదరుడైన అన వేమారెడ్డి యనేక యుద్ధములొనర్చి శాత్రవులకు బ్రక్కలోని బల్లెమై వినుతికెక్కెను. అనేక దానము లొసఁగి, యీ యనపోతా రెడ్డి కీర్తికాముడయ్యెను. మోటుపల్లి యను వర్తకస్థల మీతని కాలమున నభివృద్ధి నందెను. ఈతఁడు క్రీ. శ. ౧౩౬౪ వఱకు రాజ్యమేలెను.

## అనవేమారెడ్డి

క్రీ. శ. ౧౩౬౪ లో రాజ్యపరిపాల నాధికారము వహించెను. శౌర్యోపేతుఁడై దిగంతవిశ్రాంత యశోవిశాలు డగుటయేగాక నీతఁడు ధర్మాసక్తుఁడని ప్రసిద్ధి గాంచెను. ఈతని రాజ్యము నొక్క కబళములో మ్రింగఁజూచుచున్న అనపోతమా దానాయుల సంగరముని నిర్జించుట వలన నీతని సంగ్రామ కౌశల యశము దశదిశల మార్మోగెను. ఈతఁడు పద్మనాయకవీరులు తఱచు ధరణికోటను ముట్టడింప బ్రయత్నము లొనర్చు చుండు టచే కొండవీడను రాజధాని నగరముగ జేసుకొని యభేద్యమైన దుర్గమును నిర్మించెను.

ఇతఁడు దానమున శిబిని, కర్ణునికూడ మించెనని యనేక శాసనములు తెలుపుచున్నవి. ఈతఁడు చాలమంది కవులను

సత్కరించెను. అయినను నేకవివలనను నేకృతికి పత్తియైనట్లు కాన్పించదు. శ్రీనాథకవికృతి శృంగారనైషధకృతి భర్తయగు మామిడి సింగనామాత్యుని తండ్రియగు పెద్దన ఈతని కమాత్యుడుగా నుండెను. ౧౩౮౫ వరకు రాజ్యము పాలించెను.

## పెదకోమటి వేమారెడ్డి

పెదకోమటి వేమారెడ్డి క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరమున సింహాసనాధిష్టితు డాయెను. ఈతడును సమర్థుడగు పాలకుడే. శ్రీనాథకవి విరచిత శృంగారనైషధ ప్రబంధము కృతినందిన మామిడి సింగనామాత్యు డీ పెదకోమటి వేమారెడ్డికి మంత్రియై యుండెను.

మామిడి సింగనామాత్యుని జనకుడు పెద్దనామాత్యు డన వేమారెడ్డి యాస్థానమున మంత్రిగ నుండెనని ఈవఱలో జెప్పియుంటిమి. సింగనామాత్యునకు వేమనామాత్యుడును, పెగ్గడనామాత్యుడును నిరువురు సోదరులుండిరి. ఈ పెగ్గడనామాత్యునకే శ్రీనాథుడు పండితారాధ్య చరిత్రము నంకితమిచ్చెను. ఈ పెగ్గడనామాత్యుడు దండనాథుడుగ నుండెనని శ్రీనాథకవి వర్ణితమైన యీ పద్యము తెల్లము చేయుచున్నది.

మ. తగుఁగైవార మొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్్రీ
పెగడన్నధ్వజినీశు డంబునిధీ గంభీరుండు శులభద్విష
న్నగరద్వార కవాటపాటవ విధానప్రౌఢ బాహార్గళా
యుగళుంధాహవసవ్యసాచి ధరలోనొక్కండు పేరున్నునన్..

క్రీ. శ. ౧౪౦౫ సంవత్సరమునకు పూర్వమే సింగనామాత్యుడు శ్రీనాథకవిని పెదకోమటి వేమభూపాలుని కొలువున విద్యాధికారపదవి నిప్పించి గౌరవించెను.

పెదకోమటి వేమారెడ్డి ప్రజానురంజకముగా రాజ్యమేలెను. బ్రాహ్మణభక్తి కలిగియుండెను. వర్ణాశ్రమధర్మపరిపోషణమున బాటుపడెను. బావుల ద్రవ్వించెను. పథికులమార్గాయాస ఖేదం బపనయించుటకు సత్రముల నిర్మించెను. ఈ కాలముననే కాటయవేముండు రాజమహేంద్రవరమును బరిపాలన మొనర్చెను. కాటయవేముని కల్లాడరెడ్డి చేయూతగ నుండెను. అల్లాడరెడ్డిభార్య వేమాంబతల్లియును, గాటయవేముడును మేనత్తమేనమామబిడ్డ లగుదురు. ఈ బంధుత్వమును బురస్కరించుకొని అల్లాడరెడ్డి కాటయవేమునకు బాసటయై నిలిచెను. కాటయవేముడు క్రీ. శ. ౧౪౨౦ సంవత్సరమున మరణించెను.

పెదకోమటి వేమారెడ్డి మరణానంతర మీ రెడ్డిరాజ్యము కర్ణాటరాజుల యధీనమాయెను. క్రీ. శ. ౧౪౨౦ పరకును శ్రీనాథకవి కొండవీటిలోనే యుండెను. పెదకోమటి వేమారెడ్డి అమరుకమను గావ్యమునకు వ్యాఖ్యవ్రాసి శృంగారదీపిక యని పేరిడునాడట.

## శ్రీనాథుడు గ్రంథరచన

శ్రీనాథుడు తన గ్రంథరచనమున నిట్లు వెల్లడించుచున్నాడు :—

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయమునాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నుడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భర వయః పరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ
గీ. ప్రాయమింతకు మిగుల గైవాలకంద
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగు చేసెదఁ గర్ణాటదేశ కటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

చిన్నారి పొన్నారి చిఱుతప్రాయమునాఁడు రచించిన మరుత్తరాట్చరిత్ర గాని, నూనూఁగుమీసాల నూత్నయౌవనమున నుడివిన శాలివాహనసప్తశతి గాని, యిప్పుడెచ్చటను గానరావు. పిదప పండితారాధ్య చరిత్రమును వ్రాసి, సింగనామాత్యుని యన్న ప్రెగడనామాత్యుని కంకిత మిచ్చినట్లీ క్రింది పద్యము వలన దెలియుచున్నది.

క. జగము నుతింపగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగు పెద్దనకు గృతుల్
నిగమార్థ సారసంగ్రహ
మగు నా యారాధ్యచరిత మాదిగ బెక్కుల్.

శ్రీనాథకవి కీర్తిచంద్రికతోనే దిగంతవ్యాప్తములైనవి. విద్వాంసులు కాశీఖండము యొక్క పిండమ్మనియు, నైషధం విద్వదౌషధమ్మనియుఁ ఛలోక్తిగా అనుచుందురు. నంతరించితి నిందు జవ్వనంబునందు హర్షనైషధకావ్య మాంధ్రభాష యని వ్రాసియుండుటచే శ్రీనాథుఁ డిద్దానిని దన ముప్పది లేక ముప్పదియైదవయేట వ్రాసియుండునని చెప్పనగును.

ఈ సింగనామాత్యుని వైభవమును శ్రీనాథకవి నైషధకావ్యమున నిట్లు వర్ణించినాడు.

సీ. తన కృపాణము సముద్ధత వైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గు దలఁచుచుండ
దనబాహు పీఠంబు ధరణిభృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసగ
దనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
భవనభూములఁ గొండ్లి పరిఢవిల్ల
ధనదాన మహిమ సంతానచింతారత్న
జీమూత సురభుల సిగ్గుపరుప

గీ. బరుగు శ్రీవేమమండలేశ్వరుని మంత్రి
యహిత దుర్మంత్రి పదసముద్రాపతార
శాసనుడు రాయవేశ్యాభుజంగ బిరుద
మంత్రి పెద్దయ సింగనామాత్యవరుడు.

ఈ పద్యమువలన శ్రీనాథుఁడు శృంగార నైషధమును దనయౌవ్వనమున కొండవీడులోనుండి రచించెనని చెప్పుట కవకాశ మేర్పడు చున్నది.

## పల్నాటి వీరచరిత్ర

శ్రీనాథుఁడు పల్నాటి వీరచరిత్రమును వ్రాసెనని చరిత్ర కారులభిప్రాయపడుచున్నను, నా గ్రంథ మెవరికిని సమగ్రముగ లభింపలేదు. ప్రచురింపబడిన కొంతభాగమును ఏకాలమున వ్రాసెనో జెప్పుటకు వీలుగాకున్నది. గ్రంథారంభమున నిట్లున్నది.

"సంగీత సాహిత్య చాతుర్య కవిత
జెప్పనేర్చినవాఁడఁ జెలఁగి మాచెర్ల
చెన్నరాయని పాటసే వారతుండ
వలను భారద్వాజవంశ వర్ధనుఁడఁ
గవిసార్వభౌముఁడ ఘనతగన్నట్టి
శ్రీనాథుఁ డనువాఁడ శివభక్తిపరుఁడ.

గ్రంథాంతమున నిట్లున్నది :—

"ఘనుఁడైన శ్రీనాథకవి రాజరాజు
చెన్నుని కృపచేత జిత్త ముప్పొంగ
బాలుని విక్రమప్రౌఢ సంతయును
వివరించె జనులకు విశదమౌ దీని.

దీనింబట్టి శ్రీనాథుఁడు శివభక్తుఁడని గ్రహింపనగును.

## హరవిలాసము

శ్రీనాథుఁడు హరవిలాసమును, భీమేశ్వర పురాణము రచించుటకుఁ బూర్వమును, నైషధ రచనానంతరమును, పెద కోమటి వేమారెడ్డి మరణానంతరము వ్రాసినాడు.

ఈ గ్రంథమును శ్రీనాథుఁడు అవచిదేవ తిప్పయశెట్టి కంకిత మొసంగెను. అవచిదేవ తిప్పయశెట్టి సుగంధము, కస్తూరి మున్నగువానినమ్ము వర్తకుడై కోటీశ్వరుడై కుమారరెడ్డి కాలమున భాండాగారాధ్యక్షుడయి యుండెను. హరవిలాసములో శ్రీనాథుఁడు తిప్పయశెట్టిని గూర్చియు నాతని తమ్ములగు తిరుమలనాథ, జామిశెట్టిలం గూర్చియు, వారి వర్తకముం గూర్చియు నిట్లు వ్రాసియున్నాడు.

అవచి తిప్పయశెట్టి పూర్వుల ఘనతను శ్రీనాథుఁ డిట్లు వర్ణించినాఁడు :—

సీ. కట్టించె నొకతాత కంచి హర్మ్యంబులు
హరిణాంకమౌళి కేకామ్రపతికి
బాలార్కు మనియెడి పద్మరాగముదాచె
నొకతాత కంచినాయకుని నాభి
నొకతాత గట్టించె యోజనత్రయదీర్ఘ
తరతటాకాంభోధి తిరుపళూరఁ
గావేరిఁ గట్టించెఁ గార్పాసరాసుల
నుబ్బి చోడఁడు మెచ్చ నొక్కతాత
గీ. ప్రతిదినమ్ము గపురపు దీపములు వేయు
వ్రతముగా లొక్కతాత యీశ్వరున కొసగె
నిఖిలలోక ప్రసిద్ధ వాణిజ్యవంశ
ధరలు మాతాత లుభయ గోత్రములవారు.

సీ. పంజాబు కర్పూర పాదపంబులు దెచ్చి
జలనోగి బంగారు మొలక దెచ్చి
సింహాళంబున గంధ సింధురంబులు దెచ్చి
హరు మంజి బలుతేజి హరులు దెచ్చి
గోవసంశుద్ధ సంకుమద్రవము దెచ్చి
యాపఁగ నాణిముత్యాలు దెచ్చి
చోటంగి కస్తూరి కాటకంబులు దెచ్చి
చీనిచీనాంబర శ్రేణిఁ దెచ్చి
గీ. జగద గోపాలరాయ వేశ్యాభుజంగ
పల్ల వాదిత్య భూదాన పరశురామ
కొమరిగిరిరాజ దేవేంద్ర కూర్మిహితుఁడు
జాణజెగజెట్టి దేవయ జాముశెట్టి

అవచిదేవ తిప్పయశెట్టి దానకర్ణుండని శ్రీనాథ వర్ణితంబైన యీ పద్యము వలన దెలియగలదు.

మ. తరుణాచీనిత వాయిగోవరమణా స్థానంబులం జంద నా
గరుకర్పూర మాంబుకుంకుమరజః కస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలి జోగులన్ విరివిగా సామాన్ల దెప్పించు నే
ర్పరియౌ వైశ్యకులోత్తముండవని తిప్పండల్పుఁ డేయెంచగన్.

## మైలారు విభుఁడు

మైలారువిభుడను, నాతడొక జమీందారుఁడు. ఈతఁడు వినుకొండ గ్రామము రాజధానిగా జేసికొని వినుకొండ మండలముం బరిపాలించు చుండెను.

ఒకనా(డు మైలారువిభు(డు తన గ్రామములం జూచు కొనుటకై పల్లకిలో( బ్రయాణము సేయుచుండెను. వినుకొండ కైదామడ దూరములోనున్న వడిసెలేరను గ్రామమునకు సమీప మందున్న యొక యరణ్యముగుండ నా పల్లకి నెక్కి మైలారు విభు( డేగుచుండెను. శ్రీనాథు( డామార్గముననే మైలారువిభుని సందర్శించుటకై మొదట వినుకొండకేగి యాతడు గ్రామముల నరయుటకై పోయియున్నా డనువర్తమానముం దెలిసికొని యెట్లయినను వెంటనేపోయి యాతనిం జూడవలయునను నుద్దేశ్య ముతో బయలువెడలి యా మార్గముననే వచ్చుచుండెను. యెండ మిక్కిలి తీక్ష్ణముగా నుండెను. శ్రీనాథు( డెప్పటను నిలుపక యదే ప్రయాణముగా నిద్రాహారములు మాని రెండు దినములు ప్రయాణ మొనర్చెను. అట్లొనర్చుటచే నాతని కాయాస మెక్కు( డయ్యెను. తీక్ష్ణాతపముచే దేహమంతయు( గమలిపోయెను. క్షుద్బాధచే నాతని అవయవములన్నియు నవగతములయ్యెను. మఱికొంత సేపున కాత(డు పిపాసాయత్తు(డాయెను. అంతకంత కాదాహమధికమయ్యెను. కాలయినం గదుప(జాలక శ్రీనాథుడా బాటమధ్యమున నొక్క చెట్టునీడంబన్నుండెను. వడగాడ్పు విస్తారముగా వీ(చుచుండుటచే శ్రీనాథుని గొంతెండిపోయెను. అట్టిసమయమున మైలారువిభు( డామార్గముననే పోవుట తట స్థించెను. మార్గమధ్యమున వడ(గొట్టి పడియున్న శ్రీనాథుని మైలారు విభు(డు చూచెను. తాను పల్లకిలో( బెట్టుకొనివచ్చిన మంటికూజాలోని యుదకమును మైలారువిభు(డు తీసికొనిపోయి వెంటనే శ్రీనాథుని గొంతుకలో( బోసెను. శ్రీనాథు(డు మెల్ల

మెల్లఁగా గుటకలువేయ నారంభించెను. కొంతసేపటికి శ్రీనాథు నకు స్మారకము కలిగెను. పిమ్మట కావలసినంత జలముంద్రావి సత్తువ కలిగి యెట్టకేలకు లేచి కూర్చుండెను. మైలారువిభుఁడు తాఁదెచ్చుకొనిన చూతఫలములను శ్రీనాథునకుఁ దినుటకిచ్చి యాతని యాఁకలిం దీర్పవైచెను. కొంతసేపునకు శ్రీనాథుఁడు బాగుగా మేలుకొనెను. మైలారువిభుఁడు శ్రీనాథునిదివఱ కెచ్చటనో చూచియున్నవాఁడగుటచే వెంటనే గుఱుతు పట్టెను. శ్రీనాథుని మైలారువిభుఁడు కుశలప్రశ్నలం గావించెను. మైలారు విభుఁడు తన దర్శనమునకే శ్రీనాథుఁడు బయలుదేరి వచ్చుచున్నాడని యెఱింగినతోడనే యపరిమితానంద భరితుఁడయ్యెను. క్షుత్పిపాసా పీడితుఁడై చనిపోవనున్నవాని నరణ్యమధ్యమునం బ్రతికింపఁగల్గితింగదా యనియు, నాతఁడు మహాపండితుఁడును, విద్వత్కవియు నగు శ్రీనాథుఁడే యనియుఁ దెలిసినప్పుడాతఁడు బొందిన యానంద మింతయని చెప్పనలవికాదు. వెంటనే శ్రీనాథునిఁ దనపల్లకిలోఁ గూర్చుండఁబెట్టుకొని వినుకొండకుం బోయెను. వినుకొండపురముఁ జేరినపిమ్మట మైలారువిభుఁడు శ్రీనాథు నత్యంత వినయముతో గారవించి దినవెచ్చము నొసంగుచు నెనిమిది సంవత్సరములు శ్రీనాథుని సకుటుంబ సపరివార సమేతముగాఁ బోషించెను.

## రాయనమంత్రి భాస్కరుఁడు

శ్రీనాథుఁ డటుపిమ్మటఁ గొండవీడునందు మహాదాతయని ప్రసిద్ధిగాంచిన రాయనమంత్రి భాస్కరుని సందర్శించెను.

భాస్కరుఁడాతని మిగుల గౌరవించి కొంతకాలము పోషించెను. భాస్కరుని సందర్శించిననాఁడు శ్రీనాథుఁడీ దిగువ పద్యములను రచించి చదివెను.

ఉ. రాజితకీర్తిశాలియగు రాయనిబాచ ! భవద్యశంబు ది
క్పూజితమౌచుమించె సుర భూధరభూధరేంద్ర కాం
తాజనగోత్ర రుగ్విధుర ధాంగ రథాంగరథాంగశేష భా
షాజలజాహితాహిత తుషార తుషార తుషారధాములన్.

ఉ. ఏమినిలింపశాఖి ; పని యేమి సురేశ్వర ! యీవినిస్నుఁ జిం
తారుణిమీఁటినాడఁటఁ కదా ! మనరాయనబాచకోవిద
గ్రామణి ; యౌనయింతటన కాదుసుమీ విభవంబునందు ని
న్నోమతియందు నీగురువు నోసుకుమారత నీకుమారునో.

రాయనమంత్రి భాస్కరుఁడను పేరుగలవారనేకు లుండి నట్లు తెలియవచ్చుచున్నది. ఈ రాయన మంత్రి భాస్కరుఁడు పూర్వము (అనఁగా శ్రీనాథుఁడాతని సందర్శించుటకుఁ బూర్వ మన్న మాట) కాటయవేమునియొద్ద మంత్రిగానుండి నట్లీ క్రింది పద్యమువలనం తెలియఁ గలదు.

చ. కలయఁబసిండిగంటమునఁ గాటయవేమ సమక్షమందు స
త్ఫలముగరాయనప్రభుని బాచఁడువ్రాసిన మ్రోలమ్రోతలున్
గలుగలుగల్లుగల్లురనఁ గంటకమంత్రులగుండెలన్నియున్
జలుజలుజల్లుజల్లురనె సత్కవివర్యులు మేలుమేలులన్.

శాలివాహనశకము ౧౪౩౮ వ సంవత్సరమునకు సరియైన ధాతృనామ సంవత్సర వైశాఖమందనఁగా హూణశకము ౧౫౧౬ సంవత్సరము మే నెలలో నాదెళ్ళ యప్పామాత్యుఁడను నాతఁడు వినుకొండ సీమయందలి భర్తపూఁడి యను గ్రామమును రాయన భాస్కరుఁడను పండితునకు సకలైశ్వర్యభోగార్థమై దానమొసగి నట్లొక దానశాసనము నందుండుటంబట్టి యీ రాయనమంత్రి భాస్కరుఁడును, శ్రీనాథునాదరించిన భాస్కరుఁడు నొక్కఁడు వేఱువేఱు భాస్కరులని తెలియవలయును.

మన శ్రీనాథు నాదరించిన భాస్కరుఁడు కాటయ వేముని మంత్రియేయని రూఢిగా నిశ్చయింపవచ్చును. ఈతఁడు కొండ వీఁడునందుఁ గాటయవేమ ప్రభుని మంత్రిగానున్న కాలములోఁ గొండవీఁడునందు గోపినాథస్వామి యాలయమును గట్టించెను. ఇంతేకాక యీ యాలయమునకు జేరువ గోపినాథపురమను పేర నొక యగ్రహారమునుఁ గట్టించి యందు బ్రాహ్మణులనేకులను గాపురముంచెను. ఈ విషయములం దెలియఁజేయు పద్యమొకటి కొండవీఁడునందు గోపినాథస్వామి యాలయము ముఖద్వారము నం జెక్కఁబడియున్నది. ఆ పద్య మీ దిగువ నుదహరించు చున్నాఁడను. :—

సీ. నిర్మించె నే మంత్రి నిరుపమ ప్రాకార
సవకంబుగా గోపి నాథ పురము
గెలిచినాఁడే మంత్రి లలిత విక్రయమునఁ
బ్రబలుఁడై యవనుల బలము నెల్ల
నిలిపినాఁడే మంత్రి నియత వైభవమున
గోపికా వల్లభుఁ గూర్మివెలయఁ
బాలించె నే మంత్రి ప్రకట ధర్మఖ్యాతి
మహిమ మీఱఁగ నాంధ్ర మండలంబు

గీ. అతఁడు భూపాల మంత్రీంద్ర సతత వినుత
ధీ విశారదుఁడచ్యుత దేవరాయ
మాన్యహిత వర్తనుడు శౌర్య మహిత యశుఁడు
భానుతేజుండు రాయన భాస్కరుండు.

ఈ మంత్రి భాస్కరునిపై శ్రీనాథుఁడు రచించిన పద్యము లొకటి రెండిం దుదాహరించి విరమించెదము.

మ. అయలక్ష్మినిధి రాయనప్రభుని బాచామాత్యుఁడశ్రాంతమున్
నియతిన్ బ్రాహ్మణ పూజసేయుటభి వర్ణింపంగ శక్యంబె త
త్ప్రియ గేహంబున హేమపంజరమునన్ " బెల్లర్చితప్రార్చిత
ప్రియమేధా" యనుచుం బఠించు శుకశా రీకిన్నరీద్వంద్వముల్

ఈ భాస్కరున కుత్తుంగ భుజుఁడును నాతని కుమారుఁ డొక యగ్రహారమిచ్చెననియు ఆ యగ్రహారము నీతఁడే యనుభ వించెననియు నీ క్రింది పద్యము వలనందేట పడఁగలదు.

సీ. ఉత్తుంగ భుజసూన దత్తనందాపురీ
పుణ్యాగ్రహారాంశ భోక్తయితఁడె
ఆజన్మ సంసిద్ధ భూజన ప్రఖ్యాత
దానసింహాసనా ధ్యాసియితఁడె
కొండవీటీ రాజ్య మండలాఖిలమహా
గణక సందోహాగ్ర గణ్యుడితడె
వైకుంఠతీర్థ నిర్వాణసంయమికృపా
సంవర్ధితాఖిలై శ్వర్యుడితడె

గీ. కొండవీడుద్దగిరి పెను గొండ గుత్తి
పానుగల్లు విజయనగర పట్టణముల
నర్థులకు నిచ్చు నితఁడె యిష్టార్థమనుచు
జగము రాయన భాస్కరు బ్రెగడఁ బొగడు.

## విస్సన మంత్రి

ఈ విస్సనమంత్రి పెదకోమటి వేమారెడ్డియొద్ద మంత్రిగా నుండెను. ఈతఁడు గూడా శ్రీనాథు నాదరించిన ప్రభువులలో నొకఁడు గావున నీతని చరిత్ర మిచట గొంతఁ బొందుపఱుప వలసియున్నది.

ఆంధ్ర నియోగివంశమునందు సింగనయను నొక మంత్రి వరుఁడుండెను. ఆ సింగన్న మల్లాంబయను నామెను వివాహ మాడెను. ఆ మల్లాంబ యందు మాచన మంత్రియను నాతఁ డుద్భవించెను. ఆ మాచన్నకు విస్సన మంత్రి జనించెను.

ఆ విస్సన్న మంత్రి సద్విజోత్తములకు భూదాన గోదానాన్న దానములను విశేషముగాఁ జేయించి ద్రాక్షారామ భీమేశ్వరునకుఁ కళ్యాణమండపమును గట్టించెను. ఈ విషయము లీ క్రింది పద్యములలో ద్రాక్షారామ భీమేశ్వరుని యాలయమునం దుత్తర ద్వారముకడ నొక రాతిపైఁ జెక్కబడియున్నవి.

సీ. శ్రీమదాంధ్రనియోగి శివభక్త వంశమం
దవతరించెను సింగ నార్యమంత్రి
ఆసింగనామాత్యుఁ డమలగుణోపేత
మల్లాంబికాదేవి మహితసాధ్వీ
బరిణయంబై కనెఁ బ్రథిత గుణోపేత
మాచన్నమంత్రి దుర్మంత్రి దమనుఁ
త్రిజగతీ విఖ్యాత దివ్యయశస్కుఁడ
మ్మాచన్నగనె విస్సన మంత్రివర్యు

గీ. శివమతాచార్య శేముషీ నివహవర్యు
మేరు సమధైర్యు సమధికా చారశౌర్యు
నధిగమిత సర్వభూప సభాంతరాళ
వర్ణితానూన శౌండీర్యు వరగుణార్యు.

చ. కొమరుగ వేమభూవరుని కొల్వుననిల్చి యమాత్యశేఖరుం
డమిత భుజాబలుండనుచు నందరు దన్గొని యాడనొప్పు భూ
రమణ సభాంతరాళ బహు రమ్య దృఢస్థిర వాక్చణుండు ధీ
విమలుండుమాచనాత్మజుడు విస్సనమంత్రి యతిస్వతంత్రుఁడై

శా. శాకాబ్దంబులు శాస్త్రరామగుణ విశ్వస్థాయి సంజ్ఞన్ శుభా
నీకప్రస్ఫుట శ్రీముఖాబ్దమునఁదా నిక్షేపయుక్తంబుగా
నీకల్యాణవియుక్త మంటపము భీమేశోపయోగార్థమై
లోకారాధ్యుడు విస్సమంత్రియిడె సాలోక్యంబు సేకూరగన్.

ఈ విస్సన్న మంత్రి పెదకోమటి వేమన్నయొద్ద మంత్రిగా నున్నట్లు పై పద్యములవలనం దెలియనగుచున్నది. కాని యాతని యొద్ద ముఖ్యప్రధానుఁడుగానున్న యాతఁడు మామిడి సింగన్న యనియే యూహింపవలసి యున్నది. ఈ విషయమును శ్రీనాథుఁడు శృంగారనైషధములోని యీ దిగువ పద్యమునం దుదాహరించియున్నాఁడు.

సీ. తన కృపాణము సముద్ధత వైరి శుద్ధాంత
తాటంకముల కెగ్గుఁ దలఁచుచుండఁ
దనబాహు పీఠంబు ధరణీభృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దనకీర్తి నర్తకి ఘనతర బ్రహ్మాండ
భవన భూముల గొండ్లిఁ బరిఢవిల్లఁ
దనదాన మహిమ సంతాన చింతారత్న
జీమూత సురభుల సిగ్గుపరుపఁ

గీ. బరగు శ్రీవేమ మండలేశ్వరుని మంత్రి
యహితదుర్మంత్రివదన ముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యా భుజంగబిరుద
మంత్రపెద్దయసింగ నామాత్యవరుఁడు.

## తెలుగురాయని సందర్శనము

శ్రీనాథుఁడు పెదకోమటి వేమారెడ్డి మరణానంతరము కొండవీడునుండి ప్రౌఢదేవరాయ సేనానియు, సామంతరాజును నైన తెలుగు రాయనికడఁ గొంతకాల ముండెను. ఈతని సందర్శించినపుడు శ్రీనాథుఁడు చెప్పిన యాశీర్వాద పద్యములు.

శా. ధాటీఘోటక రత్నఘట్టన మిళద్ధాత్రీ పరాగోల్బణం
టాటంకార విలుంఠ లుంఠిత మహోన్మత్తా హితక్షోణీ భృ
త్కోటీరాంకిత కుంభినీధర సముత్కాటాటవీ ఘోట క
ర్ణాంటాంధ్రాధిప సాంపరాయని తెలుంగా ! నీకు బ్రహ్మాయువౌ.

కస్తూరి దాన సందర్భమునఁ జెప్పిన పద్యము :—

శా. అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము చేయరా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
ద్రాక్షారామపురీ విహారవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ నవ్వాసనల్.

## దేవరాయల సందర్శనము

శ్రీనాథుఁడు కొండవీడును పెదకోమటి వేమారెడ్డి భూపాలుడు పరిపాలించు కాలముననే విద్యానగరమును జూడబోయి ప్రౌఢ దేవరాయల తాతయగు దేవరాయల సందర్శించెనట కర్ణాట రాజ్యాధీశుడగు దేవరాయలు శ్రీనాథుం జూచి, తమ నివాసస్థల మెయ్యది ? ఎచ్చోటనుండి తమ యూరాక ? అని ప్రశ్నింప శ్రీనాథు డిట్లనెను.

సీ. పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల
గొనకొని విడనాడు కొండవీడు.
పరపంథి రాజన్యబలముల బంధించి
గురుతైన యుర్వీశుడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
కొమరుమించినజోదు కొండవీడు
చటుల విక్రమకళా సాహసం బొనరించు
కుటిలాత్ములకుగాడు కొండవీడు

గీ. జవనఘోటక సామంత సరసవీర
భటనటానేక హాటక ప్రకటగంధ
సింధురార్భట మోహన శ్రీల దనరు
కూర్మి నమరావతికిసీడు కొండవీడు.

## కన్నడ రాజ్యలక్ష్మి ప్రార్థన

రాజసందర్శనమున కాలస్య మగుటచే శ్రీనాథు డిట్లు కన్నడ రాజ్యలక్ష్మిని ప్రార్థించెను.

శా. కుళ్ళా యుంచితి గోక చుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిం దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా
సల్లా నంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు బోనాడితిన్
దల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుడన్.

## డిండిమభట్టు కథ

గౌడదేశమునందు డిండిమ భట్టను నొక మహాపండితుఁడు కలఁడు. శ్రీజగన్నాథక్షేత్రమును బాలించు గిరివిక్రమ దేవుఁడను రాజీతని పాండిత్యమునకు మెచ్చుకొని యీతనికొక గండపెండేరమును జేయించి యిచ్చెను. అదియునుం గాక విశాలపురమను పేరుగల యొక యగ్రహారముం గట్టించియిచ్చి యందాతని నివసింపఁజేసి యాతనికి పాండిత్య బిరుదముగానొక కంచుఢక్కాం జేయించి యొసంగెను. డిండిమభట్టుయొక్క విఖ్యాత బిరుద మనుదినంబును లోకంబులం బ్రబోధించుటకై సంధ్యాకాలములయందా కంచుఢక్క మ్రోగింపబడుచుండెను.

డిండిమభట్టు పరమఛాందసుఁడైన వైదికబ్రాహ్మణుఁడే యైనను పాండిత్యమునందు మాత్ర మసమాన ప్రజ్ఞాధురీణుఁడు. ఒకనాఁడు శ్రీనాథుఁడు విశాలపురమున కరిగి డిండిమభట్టునకుఁ దన రాక నెఱింగించెను. డిండిమభట్టు శ్రీనాథునకు దరిశన మొసంగి యాతని సన్మానించెను. కాని జన్మముచేత వైదికుడైనందున డిండిమభట్టు నియోగి బ్రాహ్మణుడగు శ్రీనాథునికంటె దాన యెక్కుడని గర్వించి యాతనికి నమస్కార మొనరించుటకు మాత్ర మియ్యకొనడయ్యెను. ఈతని యుద్దేశ్యమును శ్రీనాథుడు గ్రహించి వెంటనే యాతనికిం గర్వప్రాయశ్చిత్తముం గావింపవలెనని యెంచి "శాస్త్రప్రసంగమెద్దియేనిం గావింపుదమా" యని పృచ్ఛజేసెను. డిండిమభట్టట్లనే యని శ్రీనాథునితో శాస్త్రప్రసంగమున కియ్యకొనెను. అప్పు డయ్యిరువురకు నీదిగువ రీతిని సంభాషణము జరిగెను.

శ్రీనాథుఁడు :—బ్రాహ్మణుఁడనఁగా నెవరు ? దేహమా ? జీవుఁడా ! ధార్మిక గుణమా ? జ్ఞానమా ? లేక మఱి యేపదార్థ మీ భూమియందు బ్రాహ్మణుఁడని పిలువఁబడుచున్నది ?

డిండిమభట్టు :—" జననా యతే శూద్రః కర్మణాజాయతే ద్విజః అని శ్రుతులు వర్ణించుచున్నవి. కాబట్టి నూతనాచారముగల బ్రాహ్మణ కులమునందు జన్మించి యుపనయనాది కర్మలం గావింపఁబడిన వాఁడు ద్విజన్ముఁడగుచున్నాడు. అట్టి ద్విజన్ముఁడు బ్రాహ్మణజ్ఞాన సాధన సంపత్తిచే బ్రాహ్మణుం డనబడుచున్నాఁడు.

శ్రీనా :—ఉపనయనాధికారము బ్రాహ్మణులతో సమానముగా క్షత్రియులకుం గూడ విధింపబడియుండగా నొక్క బ్రాహ్మణులు మాత్రమే ద్విజన్మ లెట్లగుచున్నారు ? దీనింబట్టి క్షత్రియులకుం గూడ ద్విజన్మలే యగుచురుకదా ?

డిండి :—అవును. క్షత్రియులుగూడా ద్విజన్మలే కావచ్చును.

శ్రీనా :—అట్లయినచో బ్రహ్మజ్ఞాన సాధన సంపత్తి కలిగియున్న యెడల నీ క్షత్రియులుం గూడ బ్రాహ్మణులే కావచ్చుం గదా ! అట్లు బ్రాహ్మణులైన క్షత్రియులకు బ్రాహ్మణుడు నమస్కరింపవచ్చునా ? నమస్కరింపఁగూడదా ?

డిండి :—" బ్రాహ్మణోస్యముఖమాసీద్బాహూ రాజన్యః కృతః ఇత్యాది శ్రుతులప్రకారము క్షత్రియులు నమస్కరించి యాశీర్వాదములం బడయఁదగును కాని బ్రాహ్మణులచే నమస్కారము లందఁదగదు.

శ్రీనా :—తపశ్శక్తిచే బ్రాహ్మణుడైన విశ్వామిత్రునకుఁ బరశురామాది బ్రాహ్మణులేల నమస్కృతులం గావించిరి? మిథిలాదేశమునకుఁ బ్రభువైన జనక చక్రవర్తి క్షత్రియుండయ్యు నుత్తమ బ్రాహ్మణులచే నమస్కృతుల నందినట్లు తెలియవచ్చు చున్నదికదా! ఆతం డట్లేల బ్రాహ్మణులచే నమస్కృతులం గావింపబడెను? ఇది ధర్మవిరుద్ధమందువా అట్లయినచో వారేల యిట్లాచరించిరి?

డిండి :—వారికి ధర్మము సంపూర్ణముగాఁ దెలిసి యుండదు.

శ్రీనా :—వారికంటె నీకే యెక్కుడుగా ధర్మశాస్త్రము తెలిసియున్నదందువా?

డిండి :—వారివిషయ మట్లుంచి యిప్పటి ధర్మశాస్త్ర వేత్తలందఱికంటెను నాకె యెక్కుడుగా ధర్మశాస్త్రము తెలియు నని ఘంటాపథముగాఁ జెప్పగలను.

శ్రీనా :—జ్ఞాన పూర్ణులగు జనక విశ్వామిత్రాదు లట్లెం దుల కాచరించిరో యదియైనం దెలియని నీవు ప్రకృతమున గల పండితులందఱికంటె నధికుఁడనని చెప్పుకొనుచున్నావు! నీ పాం డిత్య మింతటితోనే వెల్లడియైనది. చాలుఁ జాలు నిఁక నీ సంభాష ణము లింతటితోఁ గట్టిపెట్టవచ్చును.

డిండి :—ధర్మము నివ్వరిముల్లు వాటము? ఏసందర్భము నందది యెట్లొాఱఁగునో వివేకింపరాదు.

శ్రీనా :—ఈ సందర్భమున నీకసలే తెలియదుతే పోనీ! బ్రాహ్మణులలో నియోగి వైదికులకుంగల తారతమ్య మెఱిం గింపంగలవా!

డిండి :—మీ నియోగులకంటే మా వైదికు లెక్కువ వారు. అందువలననే మీ నియోగులందఱును మా వైదికులకు నమస్కారములం గావింపుచుఁ బూజ లొనర్చుచున్నారు.

శ్రీనా :—మీ వైదికులు మాత్రము మా నియోగులకు నమస్కారములం గావించుటలేదా ?

డిండి :—ఎచ్చటను లేదు.

శ్రీనా :—ఈ వాదమును నీవు స్థిరపఱచుకొనంగలవా ?

డిండి :—ఎచ్చటకరిగిను నీనే వాదమును రూఢిగా స్థిర పరచుకొనంగలను.

శ్రీనా —అట్లు స్థిరపరచుకొన లేకుండినచో నీవు బిరుద ముగా నుంచుకొనిన కంచు ఢక్కను బగులఁ గొట్టించెదవా ?

డిండి :—ఓడిపోయినచోఁ దప్పక పగులఁ గొట్టించెదను.

శ్రీనా :—అట్లయినచో వినుము. నీవు స్మార్తుఁడవేకదా ! నీ మత మద్వైతమేకదా ! నీకు గురువు లెవ్వరో చెప్పఁగలవా !

డిండి :—అఖిలస్మార్త మతస్థులకును గురువులైన శ్రీ భగవత్పాదాచార్య శ్రీ శంకరాచార్యులవారు నాకును నీకునుం గూడ గురువులే !

శ్రీనా :—సరే ! ఆ పీఠస్వామికి నీవు నమస్కరించెదవా నమస్కరింపవా !

డింది :—తప్పక నమస్కరించి పాదాక్రాంతుఁడ నయ్యెదను.

శ్రీనా :—విద్యారణ్య స్వామియను బిరుదముతో నిపుడు జగద్గురుపీఠము నధిష్ఠించిన సాయన మాధవుని నీవెఱుంగుదువా! యెఱుంగవా ?

డిండి :— యెఱుంగకేమి ! ఆ మహాత్ముని దాసుఁగా నెఱుంగుదును.

శ్రీనా :—ఆ మాధవస్వామికి నీవు నమస్కరించెదవా ? లేదా ?

డిండి :—గురువులకు నమస్కరింప ననుట పాపము కదా ! అమ్మహాత్మునకు సాష్టాంగ దండప్రణామము లాచరించెదను.

శ్రీనా :—సాయణ మాధవుఁడు నియోగి బ్రాహ్మణుఁడు కదా ! అట్టి సందర్భమున నియోగి బ్రాహ్మణుఁడైన మాధవునకు వైదికుఁడవైన నీవేల నమస్కరించెదవు ?

డిండి :—నేను మాత్రమే కాక మా వైదికులలోని పెద్ద పెద్ద లందఱును మాధవుని పాదాక్రాంతులగుచున్నారు. నేనును బెద్దల ననుసరించి యట్లొనరింప వలసినవాఁడనే.

శ్రీనా :—నియోగులకును వైదికులకును భేద మిసు మంతయును లేదు. ఈ నియోగివైదిక వివక్షణము వృత్తి భేద ముచేఁ గలిగినది కాని జాతిభేదముచేఁ గలిగియుండలేదు. బ్రాహ్మణులందఱును సమానగౌరవములు కలవారే కాని న్యూన తాధిక్యములు నాడీ భేదముచేఁ గలుగం జాలవు. నియోగియైనను వైదికుఁడైనను సరియే ! బ్రాహ్మణుఁ డందఱకును నమస్కార పాత్రుఁడేయగును. అదియునుంగాక యేకాలము నందెనుంగూడ నియోగులే సమస్తవిషయములందు నుత్కృష్టమైన జ్ఞానమార్జించి ప్రభుత్వ పదవుల నధిష్ఠించిరి గాని వైదికుఁడొక్కరుండును ప్రభు గురుస్థానముల నధిష్ఠించినట్లు గానంబడదు.

డిండి :—అగునగును. శ్రీనాధా ! నేనే పొరబడితిని. నియోగులయం దుత్కృష్టత లేకపోలేదు. నియోగులను నమస్కరింపఁకూడ దనుట నేనే యోడిపోయితిని. నా కంచుడక్క నిప్పుడే నీ సమక్షమునందే పగుల గొట్టించివైచెదను. అదియునుం గాక దూరమాలోచించి చూడఁగా వైదికులకన్న నియోగులే యధికులని తోచుచున్నది. శ్రీనాధా ! నీకు నమస్కారము ? (అని చెప్పుచు నమస్కరించి తన కంచుఢక్క నచ్చటికిఁ దెప్పించి పగులఁ గొట్టించివైచెను.)

శ్రీనా :—(డిండిమభట్టు నాశీర్వదించి) ఓయి వెఱ్ఱి వాఁడా ! నియోగులును వైదికులునుంగూడ బ్రాహ్మణులే యైనందున వారుభయులును సమానులే కాని నాడీ భేదముచే గౌరవ లాఘవములు కలవారు కారు. మఱియు నే కుల ప్రసూనుఁడయినను దన తపశ్శక్తివలన బ్రహ్మతేజము సంపాదించి యుండెనేని యాతఁడందఱకును నమస్కార పాత్రుఁడు కాఁగలడు. కావుననే జనక విశ్వామిత్రాదులకు బ్రాహ్మణులు సయితము పూర్వకాలమున నమస్కృతు లాచరించిరి. కాఁబట్టి నీ గర్వము మాని ఋజుమార్గమునం బ్రవర్తింపుము. నేను నీచే నమస్కృతుల నందఁగోఱి నీతోడ వాదమునకుం గడంగలేదు. నీవు మహానుభావుఁడవు నీవును నాకుం బూజనీయుఁడవే కాని యలంతివికావు. నీకుఁ బదివేల నమస్కారములు. నీవీ భేదబుద్ధి నింతటినుండి మానుదువనియే నా నమ్మకము.

ఆ వాక్యములను విని డిండిమభట్టు శ్రీనాధునకు నమస్కరించి మిక్కుటముగా బహూకరించెను. ఇట్లొండొరులు పునః

పునః ప్రణామము లాచరించికొనిన పిమ్మట శ్రీనాథుఁ డాతవి యొద్ద నుండి సెలవుఁ గైకోని యచ్చటినుండి బయలువెడలి నానాదేశములం దిరిగి తన కవితా ప్రభావమును వెల్లడించు చుండెను.

## ము మ్మ క వి

ప్రౌఢదేవరాయని యాస్థానమున కరిగినపుడు ముందుగా శ్రీనాథుఁడు చంద్రభూషణ క్రియాశక్తి యొుడయని సహాయ మపే క్షింపక తదాస్థానకవియగు ముమ్మకవింజూచి యిట్లనెనట.

సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధ ప్రసవసౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళసాపుప్రాంత కదళీ వనాంతర
ద్రాక్షాలతా ఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
తాటంకయుగ ధాళధళ్యములకు

గీ. నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
తెలుఁగుసను సంస్కృతంబున బలుకనేర్తు
ప్రౌఢ దేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖంబున దయజూడు ముమ్మసుకవి.

ముమ్మకవి యసూయాపరుడై తాటస్థ్యము వహించి యుండుటకు విసిఁగి, శ్రీనాథుఁడు తానే రాజున కిట్లు పద్యమును గబురుగా నంపెను.

సీ. దంబుసూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీదగాని నా కవచమేయ
దుష్ప్రియోగంబుల దొరకొని చెప్పెడు
కవి శిరస్సునగాని కాలు సాప
సంగీతసాహిత్య సరసవిద్యల నేర్చు
కవుల తొమ్మలుగాని కాల్చి విడువ
చదివి చెప్పగనేర్చి సభయందు విలసిల్లు
కవినోరుగాని వ్రక్కలుగ దన్న
గీ. జంట కవులకు బలుపైన యింటిమగడ
కవుల వాదంబు విన వేడ్క గల్గెనేని
నన్ను బిలిపింపు మాస్థాన సన్నిధికిని
లక్షణోపేంద్ర ప్రౌడరాయ క్షితీంద్ర.

ఈ పద్య రచనానంతరమే చంద్రభూషణ క్రియాశక్తి యొడయడు శ్రీనాథకవి కాస్థానమున ప్రవేశము కలిగించెనని చెప్పుదురు.

## మంచినీటికై శ్రీనాథుని ఆవేదన

శ్రీనాథున కొకప్పుడు పల్నాడులో పరియాటనచేయ కోరిక జనించెను. ఆ పల్నాడులో నెచ్చటను చెరువులుగాని, నదులుగాని లేవు. అచ్చటచ్చట నూతులుమాత్రమే ఉన్నవి. ఆ నూతులైనను

సామాన్యముగా నున్నవా ? ఎచ్చటనో పాతాళలోకమున నున్నట్లుండెను. ఆ నీరు తోడుదమని ప్రయత్నించునెడల నధమము ఇరువురు, ముగ్గురు కష్టపడి రెండు మూడు గంటలు తోడునెడల కొంచెము నీరు వచ్చునేమో. అయిదారు కొండవీటి చేదత్రాడుల వంటివైనను కట్టనిదే ఆ నీరు వచ్చుట దుర్లభము. పైన నిలబడి లోనికి తొంగిచూచునెడల నీరెక్కడనున్నదో కానరాదు.

అట్టి యీ పల్నాడులో పయనము సల్పుచున్న శ్రీనాథ కవి సార్వభౌమునకు మిక్కుటముగ దాహమయ్యెను. మార్గాయాసము హెచ్చెను. నోటి తడి యారెను. నడచుటే కష్టమనిపించెను. ఎన్నోనిట్టూర్పులు విడుచుచు శ్రీనాథు డెట్టకేలకొక భావియున్న యెడకుపోయి, "దాహ మధికముగా నున్నది. కొంచెము మంచినీరు యిచ్చి పుణ్యము కట్టుకొనరా ?" యనెను.

"అయ్యా ! బ్రాహ్మణోత్తమా ! మీవలెనే మేమును దాహబాధాపీడితులమై గంటన్నరనుండి కష్టపడుచున్నాము. ఒక్క గంట యోపికపట్టుడు. మీ కోరిక నెరవేర్చెద" మని వారనగా శ్రీనాథుడు చేయునదిలేక యచటనే చతికిలబడి కైలాసలోకాధినాథుడగు శంకరునకు మనఃపూర్వకముగ సమస్కరించి యిట్లువినుతించెను :—

క. సిరిగలవారికిఁ జెల్లును
దరుణుల బదియారువేల దగ బెండ్లాడన్
దిరిపెమున కిద్దఱాండ్రా ?
పరమేశా ! గంగవిడువు పార్వతి చాలున్.

తా. శంకరా! విష్ణువునకు పదియారువేలమంది స్త్రీలను పెండ్లి యాడుట సహజము. అతడైశ్వర్యవంతుడు. నీవో తిరుపె మెత్తుకొని తిరుగు భిక్షకుడవు నీకిరువురుభార్య లెందుకయ్యా! పార్వతీదేవి నీకు చాలును. గంగను మాకు విడిచిపెట్టుము.

ఇట్లు వినుతింపగా శంకర కరుణా విశేషముచే నా బావి జలసమృద్ధికాగా, శ్రీనాథుడు సంతుష్టి మేరకు నీరము గ్రోలి పయనము సాగించెనట.

## పలనాటిసీమపై నిరసన

మంచినీటికై తానుపడిన శ్రమనుగూర్చి తలంచుకొన్న పుడే శ్రీనాథునకు పల్నాటి సీమయెడ నెంతో నిరసనభావము జనించెను. జలాధారములేని గ్రామము లగుటచే పల్లపుబంటల యాస యావంతయు లేదుగదా! ఇంక ఏమైన పండినయెడల నది జొన్న, సజ్జ, రాగులును.

ఇన్నింటి మించి మరొకవిషయము. పల్నాటి ప్రజలు కొంచెము మోటుదనము కలవారు. స్త్రీలు అందము కలిగి యుండక, నాగరికతా విహీనులై వెలయుదురు. వారు శుచి శుభ్రములైనను నంతగా పాటింపరు. మనస్సు నానందపరచగల యుద్యానవనములు మచ్చునకైన కానరావు. హృదయమున కానందము నాపాదించగల మనోజ్ఞదృశ్యము లయ్యెడ నెంతదూర మేగినను కానరావు. శ్రీనాథున కీ కారణములచే పల్నాటిసీమపై నెంతయు నసహ్యము గలిగించెనేగాని యానంద మొదవింప

లేదు. అందుచే నా కవిసార్వభౌముఁడు పల్నాడును గురించి యిట్లు వర్ణించెను.

ఉ. అంగడి యూరలేదు వరియన్నములేదు శుచిత్వమేమి లే
దంగన లింపులేరు ప్రియమైన వనంబులులేవు నీటికై
భంగపడంగ బాల్పడు కృపావరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్నగాన పలనాటికి మాటికి బోవనేటికిఁ౹.

## సర్వజ్ఞసింగమ భూపాల సందర్శనము

ప్రౌఢదేవరాయల యాస్థానమున డిండిమకవి సార్వభౌముని జయించినపిదప, శ్రీనాథుడు సింగభూపాలీయ గ్రంథ కర్తయు, మహావిద్వాంసుడు నగు సర్వజ్ఞ సింగమనీని దర్శింప వేంకటగిరికి బోయెను. పోవుటకుముందు శ్రీనాథుడు భారతి నిట్లు ప్రార్థించెను.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
బగులగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషణక్రియాశక్తి రాయనయొద్ద
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద

గీ. యెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగ మహిపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండినీవు
సరస సద్గుణ నికురంబ శారదాంబ!

శ్రీనాథుఁడు సింగమనీని సందర్శించి :—

క. సర్వజ్ఞ నామధేయము
శర్వునకేరావు సింగజన పాలునికే
యుర్విఁ జెల్లును ; దక్కొరు
సర్వజ్ఞుం డనుటకుక్క సామజమను టే.

## పురోహిత గృహము

శ్రీనాథుఁ డొకయూరనున్న పురోహిత బ్రాహ్మణ గృహమున బసచేసెను. ఆ పల్లెటూరి బ్రాహ్మణుడు నవనాగరికుడు కాడు. పాపమతడు మోటుగానే యుండెను. అతని గృహము చాలా చిన్నది. ఇరుకుగా నుండెను. ఆ యింటిలో నొకమూల పశువుల గట్టివైచిరి. అతడు బహు కుటుంబీకుఁడు. ఇల్లు ఎక్కడ చూచినను నపరిశుభ్రముగనే యుండెను. ఆ పశువులకు సమీపము ననే పురోహిత బ్రాహ్మణుఁడు శయనించు శయ్యకలదు. అంతియు గాక వారు విస్తరాకులు కుట్టి అమ్ముకొనుచుందురు. ఈ కారణముచే విస్తరాకులకట్ట లెన్నో కలవు ఇంతేగాక నా గృహంబున కొందరు వితంతువులుకూడ కలరు.

ఆ కుటుంబవయిఖరి చూచి శ్రీనాథుఁ డేవగించుకొని యీ పద్యమును జెప్పెను.

ఉ. దోసెడుకొంపలో పసులుత్రొక్కెడి మంచము దూరలేఁగదూడలున్
బాసిన వంటకంబు పసిబాలుర శౌచము విస్తరాకులున్
మాసిన గుడ్డలున్ దలఁప మాసినముండలు వంటకుండలుం
రానెడు కట్టెలుం దలవరాదు పురోహితు నింటి కృత్యముల్.

ఆ. చిన్నచిన్న రాళ్లు చిల్లర దేవుళ్ళు
నాగులేటినీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

క. జొన్న కలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నుగ బల్నాటిసీమ ప్రజలందరకున్.

## సమస్యా పూరణము

సర్వజ్ఞ సింగమభూపాలుని యాస్థానమున కొక కవి వచ్చి— "కుక్కవో నక్కవో ఫణివో క్రోతివో పిల్లివో బూత పిల్లివో" అను సమస్యను బూరింపగల దిట్ట లెవరైన నున్నారా యని ప్రశ్నింప నందఱును చేతగాక యూరకున్న సమయమున శ్రీనాథుఁడు లేచి యిట్లు పూరించెను.

ఉ. తక్కకరావు సింగవసుధావరుఁ డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరునేల్పు మ్రానుఁ బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నదుట ట్టదిట్టపై
కుక్కవొ! నక్కవొ! ఫణివొ! క్రోతివొ! పిల్లివొ! బూతపిల్లివో!

ఈ సమాధానమును విని యా కవి తలవంచుకొని వెడలిపోయెను.

## బా వ మ ఱ దు లు

ఆంధ్ర మహాభాగవత గ్రంథకారుడైన బమ్మెర పోతనామాత్యుండు శ్రీనాథుఁడును సమకాలికులు వీరిరువురును బావమరదులు అని పెద్దలు చెప్పుదురు. వారినిగూర్చి యిట నొక కథ గలదు.

పోతనామాత్యుడు చాలా బీదవాడు. శ్రీనాధుడు గూడ నీ తరగతిలోనివాడే గాని పోతనవలె నొకమూల గూర్చుండక భూనాయకుల దర్శించి వారల నిచ్చివచ్చినట్లు పొగడియు, నర కృతుల నొసంగియు, భాగ్యవంతుఁ డయ్యెను. వెనుకటి యవస్థ మరచిపోయెను. ఐశ్వర్యము స్థిరమనుకొని తనవలెనే నరకృతు లొసంగి భాగ్యవంతుడవు గమ్మని తన బావమరదిని ప్రోత్స హింపవలయుననెడి కుతూహలముతో బయలుదేరి తన వైభవము బావమరదికి చూపి, యాతనిని భ్రమింపజేయ వలయుననెడి కుతూహలముతో మిగుల నట్టహాసముగా తన దర్జాకు దగిన పరివారగణముతో నొక పాలకిపై బయలుదేరెను. పోతనా మాత్యుని కయిదా రెకరముల భూమిమాత్రమే గలదు. ఈభూమి

గాక వీరిజీవనోపాధి కింకెట్టి యాధారమును లేదు. పోతనగారి కుమారునిపేరు మల్లన ఈ భూమి నొకరికి కౌలొసంగక తాము స్వయముగా కష్టపడి పండించుకొని యా ఫలితమునే తినుచు జీవించుచుండెడివారు.

పోతనయు, మల్లనయు నా నాఁడా పొలమును దున్నుచుండిరి. నాడే శ్రీనాథుడు పాలకిపై బోతనను గేలిసేయవలయునని వచ్చుచుండెను. తనబావమరదియు, మేనల్లుడును పొలము దున్నుచుండగా శ్రీనాథుడు చూచి యిట్లనుకొనియెను.

"పాప మీతడు హాలికుడయి యష్టకష్టంబుల బడుచున్నాడు. ఎట్టులయిన నీతనికి హితోపదేశ మొనర్చి యీతడు రచించిన 'ఆంధ్ర మహాభాగవతము' యే మహారాజు కయినను కృతి నిచ్చుట కొడంబరుప వలయును. ఈతడెవ్వరికయిన కృతి నిచ్చినచో యీతని దారిద్ర్యము పటాపంచ లయిపోవును. నర కృతి యొసగుట కంగీంరించని వీని నొడంబరచుటయ గష్టమే. నరకృతు లొసంగుచున్న నాకుకూడ శారదాదేవి దాసురాలని నా మహాత్మ్య మీతని కెరుకపరచి పిమ్మట గృతి యొసంగుమని ప్రోత్సహించెదగాక."

అని యనుకొని తన పల్లకీ మోయుచున్న బోయీలను బిలచి "ముందుదండి మోయుచున్న బోయీలు దండివిడచి దూరముగా బొండు" అని యాజ్ఞాపించెను, బోయీ లట్లే వెడలి పోయిరి. శారదాదేవి ప్రభావముచే పల్లకి యథాప్రకారముగా నడచుచునే యుండెను. శ్రీనాథుడు తన బావమరది వయిపు సగర్వముగా జూచుచుండెను. పోతనామాత్యుని కుమారుండగు

మల్లన యా చిత్రము జూచి తండ్రికి కెరిగించెను. పోతనయు పాలకిలోనున్న శ్రీనాథుని చూచి, తన ప్రభావమునాకు జూపుటకయి యట్లొనర్చినాడని గ్రహించి తన ప్రభావము గూడ బావమరది కెఱుకజేయ దలంచి ' కుమారా ! నావలియెద్దును విప్పివేయుము ' అని యాజ్ఞాపించెను. మల్లన వెంటనే యెద్దును విప్పివైచెను శ్రీనాథుని పాలకి యెట్లు నడచుచున్నదియో, పోతనగారి నాగలి యట్లే దున్నుచున్నది. శ్రీనాథు డదిగాంచి తన బావమరదిగూడ ప్రభావము గలవాడే యని గ్రహించియు దన శక్తిసామర్థ్యంబు లింకను జూపింపవలయు ననెడి కుతూహలముతో రెండవవైపు మోయుచున్న బోయీలను గూడా దప్పుకొమ్మని యాజ్ఞాపించెను. వెంటనే బోయీలు పల్లకి విడచి దూరముగా బోయిరి.

యథాప్రకారముగా నిరుపార్శ్వములయందును గూడా బోయీలు మోయుచున్నప్పటివలెనే పాలకీ నడచిపోవుచుండెను.

మల్లన యా విచిత్రమును జూచి యథారూపముగా వర్ణించి తండ్రి కెఱిగించెను. పోతన కుమారుని వాక్యము లాలించి అట్లయిన నాగలికి రెండవప్రక్కనున్న యెద్దును గూడ విప్పి వేయుము. అని యాజ్ఞాపించెను.

వెంటనే మల్లన తండ్రియాజ్ఞ బాలించెను. ఎడ్లను గట్టినప్పటి కంటె విప్పివేసినప్పుడే నాగలి మిక్కిలి చురుకుగా భూమిని దున్నుకొనుచు పోవుచుండెను.

శ్రీనాథు డయ్యది గాంచి చకితుడయ్యెను. శారదాదేవి యితనికిగూడ దాసురాలై యున్నది. కావున నే నిట్టి కార్యము

లలో నీతనిని గెలువంజాలను. ఈతనికడ కరిగి మాటలలో గెలిచేసెదగాక అని తలంచి తిన్నగా బోతనగారి చెంతకుం బాలకినిం బోనిచ్చి యందుండి దిగి బావమరదిని గాంచి పరి యాచకములుగా 'హాలికులకు గుశలమా?' అని యడిగెను.

తన బావమరది తన్ను బరిహసించుట కూహించి యున్నా డని తలంచి యాతని గర్వపరిహార మగునట్లుత్తరు వొసంగెను.

ఉ. బాలర సాలసాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికు లైననేమి? గహనాంతర సీమల కందమూల గౌ
ద్దాలికులైననేమి? నిజదార సుతోదర పోషణార్థమై.

ఇంతతో శ్రీనాథుని నోరు కట్టుబడిపోయినది. పాపమొక క్షణము వరకును వంచిన తల నెత్తుకొనలేక పోయెను.

ఎట్టకేలకు శ్రీనాథుడు :—

'బావా! వేడుకమాటల కలుక యెందులకు!' అని పోతన క్రోధముడిపి యింటికి బోవుదము రమ్మని కోరెను. వెంటనే యందరును గృహోన్ముఖు లయిరి.

శ్రీనాథుడు బావతో తన శక్తిసామర్థ్యముల గూర్చి విశేషముగా బొగడు కొనుచు మధ్యమధ్య పోతనగారి లేమిని గూర్చి వగచి నట్లును, వాత పెట్టినట్లును మాటలాడుచు కట్టకడ పట నిట్లనియె.

క. కమ్మని గ్రంథం బొక్కటి
యిమ్ముగ నే నృపతికైన గృతి నిచ్చినచో
గొమ్మని యియ్యరె వెయ్యా
ర్లిమ్మహి దున్నంగనేల యిట్టి మహాత్మల్.

అని బోధించెను. బోతనగా రాతని వాక్యము నాలకించు చుండెనేగాని యెట్టి సమాధానము నీయలేదు. ఇంతలో వారు వారి గృహమున కరుదెంచిరి.

## పోతనకు సరస్వతీదేవి ప్రత్యక్ష మగుట

బోతనయు మల్లనయు, శ్రీనాథుడును మెల్లమెల్లగా గృహంబున కరుదెంచుచుండిరి. తన యింట నాహారపదార్థము లేమియు లేవని బోతన యెరుంగును. అట్టియెడ మహావైభవముతో చనుదెంచిన తన బావమరది నెట్లు సత్కరింపగలనా యను దిగులుతో నేమియు బాలుపోవక పోతన యెట్లో గృహంబున కరుదెంచెను.

శ్రీనాథుని, యతని వెంటవచ్చిన పరివారమును చావడిలో గూర్చుండబెట్టి పోతన లోని కరిగి కుమారుని పిలిచి యిట్లనియెను.

" కుమారా ! నీవు వడివడి పోయి వీరి కెల్లరకును చాలు నాహారపదార్థము లిరుగుపొరుగువారి నడిగి యప్పు దీసికొని రమ్మనెను. "

తండ్రి యాజ్ఞప్రకారము మల్లన పొరుగు గృహంబునకు బోయి యడిగెను. ఒకటి రెండు మానికల బియ్య మైనచో నెవ్వ

రైన నప్పు నీయగలరు. ఏమియు లేని బీదవారికి, నూరు నూట యేబదిమందికి సరిపోవు నాహారపదార్థము లెవ్వ రప్పుగా నీయ గలరు ? పాపము ! మల్లన ప్రయాస యంతయు వ్యర్థమైపోయెను. చిన్న వదనంబుతో గృహంబున కరుదెంచి తండ్రి కావార్త నెరి గించెను. ఆవార్త నాలించి పోతనామాత్యం డెంతయోవిచారించెను.

తన గృహంబున కరుదెంచిన తన బందుగుల నాత డెట్లు తృప్తి పరతునా యని విచారించుచుండెను, అట్లు విచారించి విచా రించి చేయునదిలేక తనకీ విషయంబున పరాభవము రాకుండ గాపాడు మని తన కిలవేల్పగు సరస్వతీదేవిని ప్రార్థించెను.

భక్తజన సులభురాలగు నా భారతీదేవి యాతనికి ప్రత్య క్షమై యాతని విచారకారణ మెరింగి యిట్లనియెను.

“ కుమారా ! నేనుండ నీ వేటి కిట్లు విచారించెదవు ? నీ ప్రతిష్ట కేమియు భంగము రాకుండ గాపాడెదను. నీవు వగవ వలదు. నేను తక్కుంగల కార్యము లన్నియు జూచుకొందును. వారిని స్నానములు జేసి రమ్మనుము ” అని చెప్పి యాదేవి యంతర్ధాన మయ్యెను.

హర్ష హృదయముతో పోతనామాత్యుండు చావడిలోని కరిగి “ బావా ! ఆలస్యం బెందులకు ? నీవు వేగముగా శిష్యు లతో స్నానమాచరించి రమ్ము. పెందలకడ భోజనము లొనరిం తము ” అనియెను.

శ్రీనాధు డా వాక్యము లాలించి శిష్యులతో తటాకమునకు బోవుచు నిట్లనుకొనియెను.

" ఈతడు మిక్కిలి బీదవాడే ! మమ్మందర నెట్లు సత్క రింపగలడు ! మమ్మందర సత్కరించుపాటి శక్తిసామర్థ్యంబులే యున్నయెడల నీతడు హాలికుడయి యుండు టేమికర్మము ! ఇం దేదియో చిత్రముండును. "

అందరును స్నానములు గావించి తిరిగి పోతనగారి గృహం బున కరుదెంచిరి. వీరందరును వచ్చునప్పటికి వాకిట విస్తళ్ళు వేయబడియుండెను. అందరును గూర్చుండిరి.

ఆ తరువాత పోతనామాత్యుండు తనసోదరిని బిలచినట్లు " అక్కా ! తడవేల ! వడ్డింపుము " అనియెను.

వెంటనే భారతి యొక స్త్రీ రూపము దాల్చి పంచభక్ష్య పర మాన్నంబులును దెచ్చి వడ్డించెను. వారందరును తృప్తిగా భోజన మొనర్చి బోతనగారి యైశ్వర్యమున కెంతయు నలరిరి.

భోజనానంతరము తాంబూలములను స్వీకరించు సమయం బున శ్రీనాథుడు తన బావతో నిట్లనియెను.

" బావా ! నీ వఖండ విద్యాధురీణుడవు. కవిశ్రేష్ఠుండవు. నిన్ను మించిన పండితులుగాని, నీతో సమానులగు కవులుగాని యిప్పుడులేరు. ఇట్టి వాడవయ్యును నీ విట్లు దరిద్ర మనుభవింప నేల ? ప్రపంచముపై నీ యట్టి కవీశ్వరు డెట్లు లేడో, నీ యట్టి దరిద్రుడుగూడ నట్లే లేడు. ఈ దరిద్రదేవిని బారదోలుకొనుట నీ చేతిలోనున్నది. నీవు రచించిన భాగవతము నేరాజుకైనను కృతి నిచ్చితివేని నీ కేడు మూడు పురుషాంతరముల వరకును నిలచిపోవు ఐశ్వర్యము వచ్చును. నా మాట వినుము. పరలోక

సౌఖ్యముల కాశించి యిహలోక సౌఖ్యములఁ జెందనాడుకొనకుము. పరలోక సౌఖ్యము లెవ్వడు చూచెను ? నీ కేమియు ప్రయత్నము చేయనక్కరలేదు. సమస్తమును నేను నెరవేర్చెదను నేనే రాజేంద్రునైన నొప్పించిన వానికి నీవు కృతినిమ్ము' అని యనేక విధముల బోతనామాత్యున కుపదేసించెను.

మన పోతనామాత్యుం డామాట లాలించి కొంచెము సందిగ్ధ హృదయముతో నాలోచింప మొదలుపెట్టెను. బోతన యట్లే యింకను నాలోచించుచుండగా శ్రీనాథుడు మరల నందుకొని——

"బావా ! నీవిం దాలోచింపవలసిన యగత్యములేదు. నీ వింతకు ముందు పొలములో జరగిన చిత్రచరిత్ర చూచియే యున్నావు. నే ననేక నరకృతుల నొసగింగితిని. అయినను వాగ్దేవి నన్ను తన ప్రియకుమారునిగా భావించుకొని నాకెప్పుడు కాపలె ననిన నప్పుడే ప్రత్యక్ష మగుచున్నది. నరకృతు లొసంగిన యంత మాత్రమున నీపై హాటకగర్భురాణి కాగ్రహము వచ్చునేమో యని యనుకొనకుము. నాకు ప్రత్యక్షమైన యట్లే యామె నీకును ప్రత్యక్ష మగుచుండును. విశేషించి నీవు భాగ్యవంతుడ వయ్యెదవు. కావున నీ వాలోచింపవలసిన పనిలేదు. అట్లే కృతి నొసంగెద నని నీవనుము. ఎల్లుండి సాయంత్రమునకు నిన్నష్టయిశ్వర్యవంతునిగా నొనరించెదను. కాళ్ళదగ్గరకు వచ్చిన భాగ్యదేవతను దన్ని పొమ్మనకుము. నామాట వినుము. అని యెంతయొ జెప్పెను.

పోతనగారా వాక్యము లాలించి యేమి చేయుదమా? యని దీర్ఘముగా నాలోచించుచుండెను.

అట్లాలోచించుచున్న పోతనగారికి వాణి ప్రత్యక్షమై కన్నీరు కాలువలు పారుచుండ నేడ్చుచు 'నన్ను పరులకమ్మి యా ధనముతో జీవింపదలంచుటా!' అని దీనముగా నడగుచున్నట్లు కన్పడెను—

అట్లు ప్రత్యక్షంబైన శారదాదేవిని జూచి పోతన్నగారు తన దురభిప్రాయమును మార్చుకొని చేతులు జోడించి వినమ్రభావముతో :—

ఉ. కాటుకకంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

శ్రీనాధుడు బావా! యేమాలోచించితివన "నా తల్లి భారతిని రాజులకు విక్రయింపజాల నని పోతనామాత్యుండు సమాధానము చెప్పెనట.

పోతనామాత్యుడు తాను విరచించిన యాంధ్రభాగవతములోని గొన్నిభాగములఁ శ్రీనాధునకుఁ జదివి వినిపించెను. గజేంద్రమోక్ష ఘట్టమును జదువుచు, హరి గజరాజును సంరక్షింప భయలుదేఱినచోట వ్రాసిన :—

మ. సిరికిం జెప్పడు శంఖచక్రయుగమున్ జేదోయి సంధింపఁడే
పరివారంబునుజీరఁ డభ్రగవతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమిల్లము చక్కనొత్తడు వివాదప్రోద్ధిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీఁడడు గజప్రాణావనోత్సాహియై.

అనియున్న పద్యముంగాంచి శ్రీనాథుడు బోతనతో నిట్లనెను.

'బావా! ఈ పద్య మసందర్భముగా లేదా? గజేంద్ర సంరక్షణార్థ మరుగునపుడు చక్రమైనలేకుండ బయలుదేరి ఏమి చేయును? కరిని బాధించు మకరిని చక్రము లేకుండ బోయి యెట్లు వధింపగలడు?' అని ప్రశ్నించెను.

అప్పటి కూరకుండి, కొన్ని దినములు గడచినపిమ్మట శ్రీనాథుని కుమారుని బొరిగింట దాచి, బోతన యింటికి వెళ్ళెను. అప్పుడు శ్రీనాధుడు భోజనము చేయుచుండెను. బోతన యంతట బిరబిర దొడ్డిలోని కరిగి నూతిలో బెద్దరాతిని బారవైచి కంపిత స్వరముతో 'బావా! నీ కొడుకు నూతిలో బడిపోయెను. రమ్మ రమ్మ' అని కేకవేసెను.

శ్రీనాథుఁడు వెంటనే యన్నముఁ దినకుండలేచి చేయి యైన కడుగుకొనకుండ 'అయ్యో! యని కుయ్యిడుచు ఏదీ! ఎక్కడ'! అని నూతిచుట్టును దిరుగ నారంభించెను.

బోతన యంత నవ్వాపుకొని 'బావా! నూతిలోదిగుటకు నిచ్చెనగాని, త్రాడుగాని లేకుండ పరుగెత్తుకొని వచ్చితి వెందుల కోయి? దాని వలన బ్రయోజన మేమున్న?' యని ప్రశ్నించెను.

'మతిలేక! ఏమోయి బావా? పిలిపింపుమయ్యా! ఆలస్యమౌవుచున్న' దనెను. అంత పోతనామాత్యు డిట్లని బదులు చెప్పెను.

"బావా! గజరాజును సంరక్షింప బయలుదేఱిన విష్ణువు శంఖచక్రాదులు లేకుండ బయలుదేఱి ఏమిచేయు నని యాక్షేపించితివి. జ్ఞాపక మున్నదా? నీకు నీ తనయు డెట్లో, శ్రీహరికి భక్తుడుకూడనట్లే. భక్తుడాపదలో నుండుటచే నాత్రముతో హరి ఏమియు లేకుండ బయలుదేరెననుట సంభవమైనదా? అప్రమేయ ప్రభావ భావనాతీతు డగు పరాత్పరునకు శంఖచక్రములేల? సంకల్పమాత్రమున నా మహామహాన కేది కాజాలదు? బావా! ఈ మాత్ర మూహింపలేకపోయిన కవిసార్వభౌముడవు. అందులకే నేడీ తీరునజేసి నీకు పాఠము జెప్పితిని. నీ కుమారుడు పొరుగింట నున్నాడు. రమ్మనియెను."

శ్రీనాధుడు మఱి మాటాడలేదు.

# భృంగపంచకము

శ్రీనాథకవి సార్వభౌముడు భృంగపంచక మను పేర నయిదు పద్యముల రచించెను. వానినే శ్రీనాథకవి పంచరత్నము లని చెప్పుదురు. ఆ పద్యభావము ననుసరించి యొక చక్కని గాధను జెప్పుదురు. ఆ కథ యిది :—

ఒకానొక భూపాలునకు సుకుమార సుందరాంగి యగు భార్య కలదు. ఆ రాజు మంత్రియు నసాధారణ సౌందర్యవంతుడు.

రాణికడ చతురిక యను పేరుగల దాసి గలదు. రాణి పుట్టింటి వారు ఆమెతో సరణముగా బంపిన పరిచారిక చతురిక. ఆమె నెరక జాణ. చతుర, అసాధారణ ప్రజ్ఞావంతురాలు. రాణి యొక నాడు చతురికను జూచి 'ప్రియసఖీ! నీవు మిక్కిలి తెలివైన దానవు. నీయందు నాకు ఎంతో నమ్మక మున్నది. నిన్ను మించిన ఆత్మసఖులు నా కెవరునులేరు. మంత్రి వర్యుడు సుందరుడు. ప్రశాంతగంభీరమైన ఆతని మోము నవలోకించిన దాదిగ మన్మ ధుడు తన వాడిచూపులచే నన్ను బాధించుచున్నాడు. ఆ నవ మోహనాకారుని పొందు బడయనేరని నాజన్మ కేవలము వ్యర్థము. నాకు భోజనమునం దాస క్తిలేదు. నిదురజనింపదు. నిరంతరము నా చిత్త మతని పొందుకై వేగిరపడుచున్నది. ఏమి చేసినను నీదే భారము' అన్నది.

రాణి పలుకుల కలరి యుబ్బితబ్బిబ్బైన చతురిక 'అమ్మా! ఈమాత్రమునకై అంత యారాట మొందనేల? అని ఆ మధ్యా హ్నమే చతురోపాయధురీణ యగు చతురిక ప్రధానమంత్రి సత్తముని రహస్యముగ గొనివచ్చి అంతఃపురమున జేర్చెను. రాణియు, మంత్రియు ఆనందజలధి తరంగముల నోలలాడుచు కాలపరిణామమునే మరచియుండిరి.

సాయంసమయ మైనది. భానుడస్తాద్రిని గ్రుంకినాడు. కాలాతీతమైనదని గమనించిన మంత్రి వెడలిపోవుట కుద్యుక్తు డాయెను. కాని మదనశరాహతికి జిక్కిన రాణి మంత్రిని విడువ దాయెను. తన కంఠమునందలి పచ్చలహారమును రాణి మంత్రికి బహుమానముగ నిచ్చెను. ఆతఁడు దానిని ధరించెను. ఆమె

యతని నదేపనిగా ముద్దుబెట్టుకొను చుండెను. ఇంతలో రాజు అంతఃపురములోనికి వచ్చుచుండెను. చతురిక రాజు రాకను చూచి భయపడియు, తన కళవళపాటును మోమునదోపనీయక, తన నేర్పుకొలదిగ నొక పద్యమును జదివెను.

ఉ. మాయురె! భృంగమా! వికచ మల్లికలన్ విడనాడి తమ్మిలో
నీయెడఁ బూవుఁదేనియల నింపు జనింపగ గ్రోలి సొక్కియున్
బోయెదనన్న భ్రాంతి నిన్నుబొందదు రాజుదయించె నిప్పుడే
తోయజపత్రముల్ వరుసతో ముకుళించె జలింపకుండుమా!

మంత్రిపరముగా వచ్చు అర్థము :—ఓ ప్రధానామాత్యాగ్రణీ! నీ సతీమణిని విడిచి, రాణితో సుఖసాగర తరంగముల నోలలాడుటకు వచ్చియున్నవాడవు. కాని త్వరలో వెడలిపోవక ఇచట కాలవిలంబన మొనరించితివి. రాజువచ్చుచున్నాడు. అయినను భయపడ నగత్యము లేదు. దాగియుండుము.

ఈ మాటయొక్క అర్థము గమనించినదై మంత్రిని రాణి యంధకారమున దాచివైచెను. రాజు చతురిక పద్యము విని 'చతురికా! ఆ పద్యముయొక్క భావమేమి?' అని యడిగెను.

"రాజేంద్రా! ఏమున్నది? పుష్పములపై తుమ్మెదలు వాలి మధువును గ్రోలి యంతలో సంతృప్తి వహింపనేరక సూర్యుడస్తంగతు డగుచున్నాడనుమాట మరచి మకరందాస్వాదన మగ్నులైనవి. చంద్రోదయ మింతలో నగుటచే నా తామరపూలు ముడుచుకొని పోయినందున భృంగము బందీకృత మైపోయినది కదా! ఇది చూచి మరేమియు భీతిలేదని హెచ్చరించుచున్నాను."

మంత్రిదాగియున్న గదిలోనికి గాలివచ్చుటలేదు. అతనికి అచ్చట నుండుట చాలా బాధకరముగ నుండుటచే నిటునటు కదలుచుండెను. ఆ సడి చతురిక కనిపెట్టెను. రాజుకూడా తన వలెనే సడికట్టినచో ప్రమాదము సంభవించునని ధైర్యము గొలుప నెంచి యీ పద్యము చదివెను.

చ. అళికులవర్య ! పద్మము కుళాంతరమందు వసింప నేరమిఁ
జలనము నొందెదేమిటికి? నవసారసమిత్రుడు రాకయుండునా?
తొలఁగక యందె యుండుమిక తోయజవైరి తిరంబె రాత్రి యీ
కలవరమేల తమ్మి తుదగానక వూఱక యూరకుండు మా.

మంత్రిపరమైన యర్థము :—

ఓ మంత్రి శేఖరా ! ఆ గదియందు నుండుట నీకు చాలా బాధగా యిబ్బందిగా నున్నను ఓరిమి వహించియుండక తప్పదు. సడిచేయకుము రాజిట స్థిరముగా నుండడు. నీవు వెళ్ళిపోవచ్చును. సద్దుచేయక అందేయుండుము.

తుమ్మెద పరముగావచ్చు అర్థము :—

ఓ భృంగమా ! ముకుళించుకొని పోయిన తామరపువ్వునం దుండక ఏల కళకళపడెదవు ? ఈ రాత్రి స్థిరమా ! ఈ చంద్రుడు స్థిరమా ! సూర్యోదయము గాకుండునా ? దగిన యదను ప్రాప్తించు దనుక వేచియుండుము.

మంత్రి యా యూరట వాక్యములను విని కొంత ధైర్యము వహించియుండెను. తన నాథు డెంత సేపటికిని రాకుండు

టచే విచారమందిన మంత్రిభార్య నిజనాథుని క్షేమోదంతము నెరుంగు కౌతుకముతో బయలుదేరెను. నిజమనోవల్లభునిపై రాణి మరులుకొనియున్నదని యామె యెరుంగును. చతురిక నడిగినచో విభుని సమాచారము తెలియగలదని ఆమె తలంపు. ఆమెను చతురిక చూచినది. రాజు సమక్షమున నామె ఎట్లు మంత్రిభార్య కడ కరుగగలదు ? అందుచే నన్యాపదేశముగా నిట్లనెను :—

మ. అలినీ ! తత్తరమేల నేడునిదె నీయాత్మేశుఁడౌ భృంగముఁ
జలజాసక్త మరంద పానవశతన్ సానందుఁడై యున్న వాఁ
డులు కింతేనియు లేక నీవరుగుమీ యొప్పారు నిప్పాట నీ
చెలువుండున్ బఱతెంచు వేకువను రాజీవంబు పుష్పించినన్.

మంత్రిభార్యవైపు అర్థము :—

తల్లిరో ! రాణివలన సకలసౌఖ్యానుభవ మంది, ఆ యెల నాగ యధరసుధారసపానమగ్నుడై సుఖంబున్నవాడు, నీకేమియు శంకవలదు సూర్యోదయానంతరము నీ భర్తరాగలడు. భృంగము వైపు గా వచ్చు అర్థము :—

ఓ యాడుతుమ్మెదా ! నీ నాథుడగు మగతుమ్మెద తామర పూవులోని మధువునుగ్రోలి, యొడలుతెలియని యవస్థలో నందే నిద్రపోయినది. మఱేమియు భయములేదు. నీవు నీ స్థానమునకు బొమ్ము. సూర్యుడుదయించినంతనే తామరపూవు వికసించును. నీనాథు డపుడు తిరిగి రాగలడు.

మంత్రిభార్య జరిగిన యుదంతము గ్రహించి మహదానంద భరితాత్మయై స్వగృహమునకు బోయినది.

రాజు రాణితో గలసి మన్మథకేళిం దేలియాడి బడలి నిద్రించెను. అలసి సొలసియున్న రాజుభార్యకూడ నిద్రాముద్రిత యయ్యెను. అదియే అమాత్యుడు పలాయన మొనరించుటకు తగినయదనని భావించిన చతురిక మంత్రికర్థమగునట్లీ పద్యముం జదివెను :—

మ. పతి నిద్రించినవేళ రాదగునయో పద్మారి యీ కేళికా
 యతనంబందు నతిశ్రమన్ విభుడు నిద్రాసక్తుఁడై యుండె
 శత పత్రేక్షణమోము వాంచినది నీ సామర్థ్యముం జూపటో
 కతివేగంబుగ నేగుమా తొలగి మా యాత్మల్ సుఖంబందగన్.

ఈ పద్యార్థమును గ్రహించి, మంత్రిశేఖరుఁడు తటాలున నీవలకువచ్చి వెడలిపోయెను. మరునాటి యుదయమున కొలువు కూటమున నత్యవసరకార్యము లుండుటచే అవసరమైన విశ్రాంతిని పొందకుండ త్వరితగతిని బయలుదేరెను. పాప మాతడా కార్య నిర్వహణమునం గల యాత్రముచే రాణి తనకు తొల్లిటిరేయి ప్రేమమీర నొసంగిన యా పచ్చలహారమును యింటికడ భద్ర పరచుకొనకుండగనే బయలుదేరెను.

రాణి తన శయ్యాగారమువీడి యీవలకువచ్చి త్వరితగతి నేతెంచుచున్న మంత్రికంఠమునంగల యా పచ్చల హారమును జూచి, భయకంపిత యయ్యెను. అయ్యది చాల విలువైన హారము. ఆస్థానమున తన భర్త మంత్రికంఠమునంగల యా హారమును చూచినచో నెంతప్రమాదము ! ఆమె కేమియుతోచక,

వెంటనే చతురికను బిలిచి " చెలీ ! చూచితివా ? ఆ మంత్రిశేఖరుని మెడలోని హారమును దిలకించితివా ? ఆతడు మరచిపోయి హారముతోడనే కొలువుకూటమున కరుగుచున్నా డెంత ప్రమాదము సంభవించునోకదా ! నీవేదైన యుపాయ మాలోచించి యీ యపాయమునుండి నన్ను రక్షింపుభారం నీదే " యనెను.

'అమ్మా ! మరేమియు భయములేదు.' అనిపలికి వెడలిపోయెను.

సభాభవన మంతయు కిటకిటలాడుచుండెను. రాజు సింహాసనాసీనుఁ డయ్యెను. రాజకీయ వ్యవహార విచారణ మింకను ఆరంభింపలేదు. ఇంతలో నొక భట్టువచ్చి ఆస్థానమంతయును కలయజూచి యీ పద్యమును జదివెను :—

చ. అతుల ! సభాంతరస్థిత బుధావళికెల్ల జోహారు, వీరరా
హుతులకు మేల్జోహారు సతతోజ్వల విక్రమసార్వభౌమ సం
తతికి జోహారు వైభవ వితార పురందరుడైన యట్టి భూ
పతికి జోహారు మానపరిపాల జోహారు ప్రధానశేఖరా ?

అందరికంటె తన్ను విశేషముగా మానపరిపాలకయని సంబోధించుటచే ఆశ్చర్యచకితుడైన మంత్రి యయాచితముగ నప్రయత్నముగ వక్షస్థలమును దడవికొనెను. పచ్చలహారమును జూచి నిశ్చేష్టుడై యా భట్టు కుహనరూపముననున్న చతురికయే యని గ్రహించి తన యంగరఖాలో , నా పచ్చలహారము నుంచి యా భట్టుకు బహూకరించెను. రాజుకూడ కొన్ని బహుమానము లిచ్చెను.

మారురూపమున నున్న చతురిక ప్రమాదము తప్పెనుమా యని తోచునటుల చిరునవ్వు నవ్వి వెడలిపోయెను.

## గోపినాధుడు కథ

గౌడదేశమునందు గోపినాథుఁడను పేరుగల యొక గౌడ బ్రాహ్మణుఁడుండెను. ఈతఁడు కొంచెము కొంచెమాంధ్రకవిత్వ ముం జెప్పఁగలిగి యుండెను. పరిపూర్ణ పాండిత్యము లేకుండు టచే నంతగా నాతనినెవ్వరును గౌరవించుటలేదు. అయిన నాతడే యుపాయముచేత నయినను దన కవిత్వము నుపయోగపరచి గౌరవమందవలెనను కుతూహలము మాత్ర మాతని విడువ కుండెను.

శ్రీనాథుఁడు వేమభూపాలుని యాస్థానకవియనియు వేమా రెడ్డి యాతనిఁ గొండొకకారణంబున నాస్థానబహిష్కారముం గావించుటచే నాతఁడిప్పుడు దేశాంతమున నుండెనని శ్రీనాథుని వేమభూపాలుఁడేగాని వీరభద్రభూపాలుఁ డిదివఱకెన్నఁడునుం జూచియైన నుండలేదనియు, శ్రీనాథునిం గుఱుతు పట్టగలవా రెవ్వరును రాజమహేంద్రవరమున లేనే లేరనియు నాతఁడెవ్వరి వలననో బాగుగా నెఱుంగనివారివలన విని, యొక్కయుక్తిం బన్ని వీరభద్రారెడ్డిచే బహుమాన మందవలెనని యాతఁ డూహించెను.

తానే శ్రీనాథుఁడనని వీరభద్రారెడ్డికిం దెలియఁజేసి యాతని సందర్శించినచోఁ దన్నాభూపాలుఁడు బహూకరించునని

యెంచుకొనెను. కవి గౌరవముం బొందవలయునను దురాశం జెందినవాఁడగుటచే నందువలన యసత్యవాచాదోషము సంభ వించెనని యెఱింగినవాఁడయ్యును దానింబాటింపఁడయ్యెను. అధిక తృష్ణాంతురునకు పాపపుణ్య కార్యవివేచనజ్ఞాన మెట్లుండును ? తన మోసముబయలంబడినచోఁ దనకు గౌరవమునకు మాఱు శిక్షయే సంప్రాప్తించునని యాతడెఱింగిన వాఁడయ్యును మోసము బయలం బడకుండగఁనే వర్తింపవలెనన్న ధైర్యముతో నా కార్యమునకు సాహసించెను. తాను శ్రీనాధుఁడనని చెప్పకొనుట కాతని కన్నియు ననుకూలముగానే యుండెను. కాని, శ్రీనాధుని సరియైన నామధేయము "శ్రీనాధుఁడని యాతఁడు మూఁఢజనుల వలన వినియున్నవాఁ డగుటచే తాను శ్రీనాధుఁడనని నామకరణ ముం జేసికొని రాజ్మహేంద్రవరమున కేతెంచి వీరభద్రభూపాలుని సందర్శించెను. అప్పుడా వీరభద్రారెడ్డికిని యీ వచ్చిన కుహనా శ్రీనాధునకు నీదిగువ రీతిని సంభాషణము జరిగెను.

వీర :—నీ వెవ్వడవు ?

గోపీ :—అయ్యా ! నా పేరు శ్రీనాధుఁడందురు. పూర్వము మాది కొండవీఁడు కాపురము.

వీర :—ఇప్పుడెచ్చటనున్నావు ?

శ్రీనా :—వేమభూపాలునిచే నాస్థాన బహిష్కారముం గావింపఁ బడినతరువాత దేశంబులబడి పొట్టకూటికై క్రుమ్మరు చుంటిని.

ఈ వాక్యములాలించి వీరభద్రారెడ్డి యీ వచ్చిన యాతఁడు శ్రీనాధుఁడు కాడనియు గౌరవముం బొందుటకై యాతని పేరు

బెట్టుకొని వచ్చిన వాఁడనియు విదేశస్థుఁడగుటచే శ్రీనాథుని నామధేయ మీతనికి బాగుగా తెలియక శ్రీనాథుఁడను పేరిడుకొని యున్నాఁడనియు దెలిసికొనెను. గోపీనాథుడు భావించినట్లు శ్రీనాథుని వీరభద్రారెడ్డి యెఱుంగకపోలేదు. శ్రీనాథుఁడును వీరారెడ్డియుఁ జిన్నప్పటినుండియు నతిమైత్రితో మెలంగినవారే. గోపీనాథుఁని మోసముం గ్రహించియు వీరారెడ్డి యాతని శిక్షింపఁ దలంచుకొనలేదు.

తుదకాతనిఁ బరాభవింపనైనను దలంచుకొన కుండుటచే వీరారెడ్డి ప్రాకృతుంబోలె నాతనితో సంభాషించెను. నేరముంగని పెట్టి యుండియుశిక్షించుట కధికారముండియు శిక్షింపకుండ నెవ్వ రూరుకొందురు ? భూతదయాపరుఁడును మహాగుణసమన్వితుఁడు నైన వీరారెడ్డికొక్కనికే యా విరుద్ధము చెల్లినది. వీరభద్రారెడ్డి మఱల గోపినాథునిట్లు ప్రశ్నవైచెను.

వీర :—నీ కుటుంబమంతయు నిప్పుడెచ్చటనున్నారు ?

శ్రీనా :—శ్రీనాథుని కుటుంబమంతయు నిప్పుడు కొండవీటి యందుండెనను విషయమెఱుంగని వాడగుఁటచేతను శ్రీనాథుని కుటుంబము శ్రీనాథునితోడనే యాతఁడెక్కడ కరిగిన నచ్చటికెల్ల నరుగుచున్నారనుకొనుట చేతను, శ్రీనాథుఁడు తన తోడనే యున్నాడని చెప్పెను.

వీర :—నీవిప్పుడిచ్చటికి వచ్చిన పనియేమి ?

శ్రీనా :—దేవర నా రాకకై నిరీక్షించి యున్నట్లు తెలియ వచ్చినందున నేలికప్రాపుగోరి వచ్చితిని.

వీరభద్రారెడ్డి యాతని శ్రీనాధుఁడని నమ్మినట్లుగాచే నటించి యాతని కొకవిడిదినిప్పించి యాతఁడెక్కడకుం బోవ కుండునట్లు రక్షకభటులను బ్రచ్ఛన్నముగాఁగావుంచి నెలకు నూరు దీనారములచొప్పున నిచ్చుట కేర్పాటు గావించెను. గోపీనాధుఁడును వీరారెడ్డి తనను శ్రీనాధుఁడని నమ్మి బహూకరించెనని భావించుకొనెను. ఇట్లు రాజాస్థానమునం బ్రవేశము సంపాదించి గోపీనాధుఁడు రాజసభకనుదినంబును వచ్చుచుఁ బోవుచు చనువున మెలంగుచుండెను. అప్పుడప్పుడు గోపీనాధుఁడు తనకుంగల కొద్దిపాండిత్యముతోడనే పద్యములను రచియించి చదువుచుండెను. వీరభద్ర భూపాలుఁడా పద్యములకు సంతసించినవాఁడుం బోలె నటించుచుండెను.

ఒకనాడు వీరారెడ్డి గోపినాథుంజూచి నీకు శ్రీనాథుఁడును నామమెట్లు కలిగినదని యడిగెను.

"నేను శృంగారకవిత్వమును బాగుగా జెప్పఁగలిగి యున్నందున స్త్రీలందఱును ననుఁజూచి వలతురు. అకారణము వలన నేను శ్రీనాధుఁడనైతి" నని యాతఁడు బదులుచెప్పెను.

"అనఁగా నా కేమియు నర్థముకాలేదు. బాగుగా విడఁదీసి చెప్పుమ" ని రాజడిగెను.

"స్త్రీలందఱును నన్నుఁజూచి వలచుటచేత నేను స్త్రీనాధుఁడనైతిని. అనఁగా స్త్రీలందఱును నన్ను నాయకభావమునం జూతురు కాబట్టి నేను తప్పక స్త్రీనాధుఁడనే యని గోపీనాధుఁడనెను.

వీర :—తొల్లింటి నీనామధేయమేమో నీవు చెప్పగలవా ?

స్త్రీనా :—అందఱును నన్ను చాలాకాలమునుండి స్త్రీనాథుఁడనియే పిలుచుటచేత నేను తొల్లింటిపేరు మఱచిపోతిని.

వీర :—నీవు స్త్రీనాథుఁడవని వాదించి స్థిరపఱచుకొనఁగలవా ?

స్త్రీనా :—ఎట్టి మహావిద్వత్కవి వచ్చి వాదించినను రూఢిగా స్థిరపరచు కొనంగలను.

వీరభద్రారెడ్డి సరే మంచిది. తగిన పండితుని బిలిపించి నీవాదమును బరిశీలించెదనని యాతనికి సెలవొసంగి నాటికాసభ చాలించెను. వెంటనే వీరభద్రారెడ్డి తెనుంగురాయలకడ నున్న శ్రీనాథుని గౌరవపూర్వకముగా నాహ్వానించి తన యాస్థానమునకుం బిలిపించెను. శ్రీనాథుఁడును గతిపయ దివసంబులకు రాజమహేంద్రవరమున కేతెంచి వీరభద్రారెడ్డిని సందర్శించెను.

వీరభద్రారెడ్డికి గోపీనాథుని యుదంతమంతయు నెఱింగించి యాతనికి గర్వప్రాయశ్చిత్తముం గావింపుమని నుడివెను. శ్రీనాథునకును స్త్రీనాథునకును వాదమునకై యొక దినమేర్పాటు గావింపఁబడియెను. ఆ దినమున రాజమహేంద్రవరము నందలి జనులాబాల గోపాలమును నా వాదము వినుటకై వచ్చియుండిరి. ప్రపంచములోని స్త్రీలందఱకును నొకఁడు తానే నాథుఁడనని చెప్పి వాదింపఁబూనుట యాశ్చర్యముకాదా ? సభయంతయుం గొంత సేపునకు నిశ్శబ్దమయ్యెను. అప్పుడు శ్రీనాథ గోపీనాథుల కిఱువురకును నీ దిగువ రీతిని సంభాషణము జరిగెను.

శ్రీనా :—స్త్రీనాథా! నీ వాదమేమని?

స్త్రీనా :—నా పేరు స్త్రీనాథు(డందురు. ఇదినాకు సార్థక నామము.

శ్రీనా :—సార్థక నామమెట్లయ్యెను.?

స్త్రీనా :—నేను శృంగార రసోచితముగా( గవిత్వ మల్ల( గలను. అట్టినా కవిత్వమునకు లోనై స్త్రీలందఱు నన్ను నాయకాభి ప్రాయముతో( బ్రేమించుచుందురు. ఆ కారణముచే నేను స్త్రీనాథు(డ నైతిని.

శ్రీనా :—అట్లయిన నీవు స్త్రీజాతికంతకును నాయకు(డవన్న మాటయే!

స్త్రీనా :—ఆహా! ముమ్మాటికి నది నిశ్చయము.

శ్రీనా :—ఈ వివాదమున కోడిపోయినచో నీ వేమి ప్రాయచిత్తము గావించు కొనియెదవు?

స్త్రీనా :—నే నోడిపోయినచో( గవిత చెప్పుట మానివైచి నీ పాదసేవన మొనర్చుకొను చుండెదను.

శ్రీనా :—అట్లయినచో వాదమున కుపక్రమింపుదమా?

స్త్రీనా :—అవశ్య ముపక్రమింప వచ్చును.

శ్రీనా :—నా ప్రశ్నములకు సమాధానముం జెప్పుము. నీవు స్త్రీజాతికంతకును నాథు(డవేకదా?

స్త్రీనా :—అగుదునని చెప్పుట యెది మూడవతూరి!

శ్రీనా :—నీ తల్లి యాడుదియా? లేక మగజాతియా?

స్త్రీనా :—నా తల్లి యాడుదియే!

శ్రీనా :—ప్రపంచమునం గల స్త్రీజాతికంతకును నీవు నాథు(డవగునప్పుడు నీతల్లికింగూడ నాథుడవే యగుదువుకదా !

స్త్రీనా :—( తలవంచుకొని యూరకుండెను. )

శ్రీనా :—ఏమి మాటాడవు ? నీవు ! స్త్రీనాథుడవుకావా యేమి ? నీతల్లి మాత్రము స్త్రీకాదాయేమి ? నీవు స్త్రీజాతికంతకును నాథు(డవైనప్పుడు నీ తల్లికిమాత్ర మేల కా(గూడదు ?

ఈ మాటలు గోపినాథు(డు విని తన తప్పిదమునంతయు నొప్పుకొని తన వృత్తాంతమంతయు విన్నవించుకొని క్షమింపు డని వీరభద్రారెడ్డిని శ్రీనాథుని ; తక్కిన సభవారిని బ్రార్థించెను ఇంతియెకాక వివాదమునం దోడిపోయినందున గోపినాథు(డు శ్రీనాథున కుపచర్యచేయుట కంగీకరించెను.

## బొడ్డుపల్లి

తన బావమరదిని ' హాలికులకు క్షేమమా ' అని యాక్షే పించిన శ్రీనాథ కవిసార్వభౌముడు దేశాటనము జాలించి బొడ్డు పల్లెను సేద్యము జేసికొనుచు కాలము గడుపుచుండెను.

బొడ్డుపల్లి కృష్ణాజిల్లాలోనిది. ఇది కృష్ణానది కత్యంతర సామీప్యములోనున్నది. హాలికులను యాక్షేపించినపుడు డీతని కేమియు గష్టము గలుగలేదు. కాని యా పనియే యీతని నెత్తిపై బడినప్పు డష్టకష్టంబులకును లోనయ్యె ననుటలో నతిశయోక్తి యెంతమాత్రమునులేదు.

ఈతని దురదృష్టమువలన నా సంవత్సరమా కృష్ణానది పొంగి పైరులనెల్ల బాడుజేసిపైచినది. పంట పోయినను పన్ను మాత్రము తప్పదు.

తన యౌవనమునం దార్జించిన విత్తమంతయు విచ్చల విడిగా నిర్లక్ష్యముగా వెచ్చించివయిచుటను నప్పటి దొరతనము వారికి పన్నిచ్చు కొనుటకు తగిన సామర్ధ్యంబు లేక మిగుల విచారించుచు చేయునదిలేక యీ క్రిందివిధముగా తన దుఃఖమును వెళ్ళబోసికొనెనట.

సీ. కవిరాజు కంఠంబు కౌగలించెనుగదా
పురవీధి నెదురుండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిట నుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డివిద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగోడియ

కృష్ణవేణమ్మ గొనిపోయెను నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు బెసలు
బొడ్డుపల్లిను గొడ్డేలి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు.

## వారకాంతలు

ఈ కవిశేఖరుడు నొకరాజు దర్శనార్థమై ఒకవూరు యేగెను. అచ్చట రాజు గుణవర్తనాదులుగూర్చి ముచ్చటించెను. ఆరాజు సర్వదా వారస్త్రీలతో పొందుగూడుచు వారికొరకే తాను జన్మించినట్లు వారింటనే యుండుచు వారి కనేక కానుక లర్పించుచు గడుపుచున్నాడు.

అట్టి కాముకునికి మతియే యుండదు. అట్టివాడు కవులన్న, గాయకులన్న, పండితులన్న గౌరవమేలేదు. పైగా వారికి దర్శనమే యిచ్చుట దుర్లభము. ఈ విషయమంతా గ్రహించిన శ్రీనాథు డిట్లు చెప్పెనట—

మ. కవితల్ జెప్పిన పాడనేర్చిన వృథాకష్టంబె యీ భోగపుం
జవరాండ్రెగదా భాగ్యశాలినులు పుంస్త్వంబేల పోగాల్పనా ?
సవరంగా సొగసిచ్చి ఖేల్ యువతి వేషంబిచ్చి పుట్టింతువే
యెవరన్ మెచ్చి ధనంబు లిచ్చెదరుగాదే పాపంపు దైవమా !

## నీలాటిరేవు

ఒకనాడు శ్రీనాథుఁడు స్నానార్థ మరిగి యొక చెరువు గట్టున గూర్చుండెను. అంతకు మున్నే నీటికై చనుదెంచిన స్త్రీలుకొందరు స్నానంబు నాడుచుండిరి. కొందరు బట్ట లుతుకు కొనుచుండిరి. మరికొందరు నీటిని బిందెలో నింపుకొని యిండ్లకు పోవుచుండిరి. కొందరు నీటిని సంగ్రహించుకొని బిందెలు భుజములపై బెట్టుకొని తమ చెలులరాకకై నిరీక్షించుచుండరి.

స్త్రీలును యాతడు గట్టుమీద గూర్చుండి తాము వెడలిన పిదప స్నానము చేయుటకయి వేచియున్నాడని గ్రహింపక చొల్లు పురాణములతో గాలయాపనము చేయుచుండిరట. అతడూరక వారి వారి సంభాషణ వినుచు వారెప్పుడు పోదురా యని నిరీక్షించి యుండెను. కాని వారుమాత్ర మటనుండి కదలలేదు. ఆ సందర్భ మున నీలాటి రేవులోనున్న కాంతలగూర్చి జెప్పినపద్యములు.

ఉ. వీసపు ముక్కునత్తు నరవీసపు మంగళసూత్ర మమ్మినన్
గాసునురాని కమ్మలర కాసునుగానివి పచ్చపూసలన్
మాసిన చీరగట్టి యవమాన మొసంగుచు నేడురాగ నా
కాసలనాటివారి కనకాంగిని జూచితి నీళ్ళరేవునన్.

శా. పోచ్చెం బింతయులేని హంసనడకతో బొల్పొందు లేనవ్వుతో
బచ్చల్దాపిన కుల్కుముంగురలతో బాగైన నెమ్మోవితో
నచ్చంబైన ముసుంగువెట్టి చెలితో నా మాటలే యాడుచున్
వచ్చెంబో కుంచకుంభముల్ గదలగా వామాక్షి తానీళ్ళకున్.

క. నీలాటి రేవులోపల
మేలిమితో దీర్చినట్లు మెరసినిలుచుచున్
దాలిమిని వాలుజూపుల
బాలామణి గుట్టబైట పడగా జూచెన్.

అట్టి సమయంబున నొక పూజారివారి గోడలు నీళ్ళ బిందెను భుజముపై బెట్టుకొని గట్టునెక్కుచు, వెంటవచ్చు వారితో మాటలాడుచు తన చెలికత్తియ యింకను వచ్చుటలేదే మని వెనుకకు జూచుచు ముందునకు నడచుచుండెను. వెనుకకు

జూచుచు ముందునకు నడచుటలో కాలుజారి పడిపోయినదట. ఆమె వెంటనే లేచి, పడినందుకు నన్నందరును గేలిసేయుదురే మోయను సంశయముతో నామెయే యిటునటు చూచి పక్కున నవ్వినదట. ఈ యంశ మీ క్రిందివిధముగా జెప్పెను—

క. పూజారి వారి కోడలు
తాజారగ బిందెజారి దబ్బునబడియెన్
మైజారు కొంగు తడిసిన
బాజారుం దిరిగిచూచి పక్కున నవ్వెన్.

## కా రె మ పూ డి

పల్నాడులో కారెమపూడి యను గ్రామముకలదు. శీలము బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, నాయకురాలు మున్నగు పలనాటి వీరులు జ్ఞాపకార్థ మిప్పటికిని కారెమపూడిలో కార్తీకమాసమున గొప్పయుత్సవములు జేయుచుందురు. శ్రీనాథుడా గ్రామమును గూర్చి ఇట్లు వ్రాసెను :—

ఉ. వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుడు కళ్ళిపోతురా
జారయ గాలభైరవుడు నంకమశక్తియ అన్నపూర్ణయుఁ
గేరెడుగంగధారమడుగే మణికర్ణికగా జెలంగు నీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి సీమకున్.

## కడిది పురము వారకాంతలు

శ్రీనాథకవిసార్వభౌము డొకప్పుడు కడిదిపురమున కరిగెను. ఆయూరి తీరీతని కెంతమాత్రము నచ్చనందున నీపద్యముల జెప్పెను.

క. ముదివిటులు విధవలంజెలు
పదకవితలు మారుబాస బాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్.

ఉ. చీరయు ముక్కు ముంగరయు జెంపలగంధము చుక్కబొట్టు
జీర ఝుణఝుణారవము జేతులగంకణ నిర్వణంబు నొ
య్యారపు జాఱుకొప్పును గయాలితనంబునుగాని లోన శృం
గార మొకింత లేదనుటగంటిని యీపురి వారకాంతలన్.

## తమిళనాడు

శ్రీనాథకవి యొకప్పుడు తమిళనాడున కరిగి, యచటి ద్రావిడులం జూచి యీక్రింది పద్యముల వర్ణించెను.

గీ. మేత గరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనమున బందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగ బిల్లిపిల్ల
అందమున గోతిపిల్ల యా యఱవపిల్ల.

సీ. కూడుతలపజోళ్ళు కూరకారామళ్ళు
చెవులంత వ్రేలాళ్ళు చేలుమళ్ళు
దుత్తిదేనాగళ్ళు దున్నపోతులయేళ్ళు
కలవు మాపటివేళ గంజినీళ్ళు

మాటమాటకు ముళ్ళు మఱిదొంగదేవళ్ళు
చేదైన పచ్చళ్ళు చెఱకునీళ్ళు
వంటపిడ్కలదాళ్ళు వాడనూతులనీళ్ళు
వినవిరుద్ధపుబేళ్లు వెదవనోళ్ళు
సఖులచక్కనిబైళ్ళు చక్కని మామిళ్లు
పరువైన వావిళ్ళు పచ్చవళ్ళు

గీ. దళమయినయట్టి కంబళ్ళు తలలుబోళ్లు
పయిడికిని జూడ బయిదెత్తు ప్రత్తివిళ్లు
చలముకొని వెదకినలేవు చల్లనీళ్లు
చూడవలవెను ద్రావిళ్ళ కీడుమేళ్లు.

సీ. తొలుతనే వడ్డింత్రు దొడ్డమిర్యపు జారు
చెవులలో బొగవెళ్ళి చిమ్మరేగ
పలుతెఱంగులతోడ బచ్చళ్లు చవిగొన్న
బ్రహ్మరంధ్రముదాక బారునావ
యవిసాకువేచిన నార్నెల్లు పసిలేదు
పరిమళ మెంచిన బండ్లు సొగసు
వేపాకు నెండించి వేసిన పొళ్ళను
గాంచాన గాంచిన గ్రక్కువచ్చు

గీ. నఱవవారింటి విందెల్ల నాగడంబు
చెప్పవత్తురు తమతీరు సిగ్గులేక
అహహ యీతీరు లెచ్చట నరయరాదు
చూడవలసెను ద్రావిళ్ళ కీడుమేళ్లు.

# రామయ మంత్రి

శ్రీనాథుఁడు పోతనమాత్యుని నాతని భార్యాపుత్రులను దన యింటికిం దీసికొనివచ్చిన కాలమునందే గుడ్లూరునకుఁ గరణ మును దనకు రెండవబావయును నగు రామయ్యామంత్రిని యతని భార్యాపుత్రులను గూడఁ దనయింటికిఁ బిలుచుకొని వచ్చెను. సంతాన వంతురాలగు గలిదిండి కామయ్యభార్యయగు మంగమ్మయుఁ దన యనుంగుబిడ్డలతో నెప్పుడును శ్రీనాథునియింటనే వసించి యుండెను. ఇంతమంది బంధుగులతోడం గూడియున్నప్పుడే శ్రీనాథునకుఁ బరమసంతోషముగా నుండెను. ఈ దినములయం దీతఁడు నిర్విచారముగానుండి దైవపూజాదికములతోడను బ్రాహ్మణ సమారాధనములతోడను మహానందముగాఁ గాలక్షేపముఁ జేయు చుండెను. ఒకనాఁడందఱుం గూర్చుండి భుజించుచుండఁగా రామయమంత్రి శ్రీనాథుం జూచి "బావా! ఇన్ని గ్రంథములను రచించితివి. కాని నాపై నొకపద్యమేనియుం జెప్పవైతివి కదా! నేను మాత్రము నిన్ను సత్కరింపఁజాలనా!" అని యడిగెను. అందుపై శ్రీనాథుఁడు సత్కారమున కేమికాని, బావా? నీపైఁ బద్యమేమని చెప్పుమందు వోయి! నీవొక మంత్రివికావు. దండనాథుఁడవు కావు! అశేషసౌఖ్యము లనుభవించు మిరాసి దారుఁడవు. అయినను నీవడిగినందులకై నను జెప్పకుండుట సమంజసముకాదు చెప్పెదను వినుమ"ని యీ క్రిందిపద్య ముంజదివెను.

ఉ. గ్రామము చేతనుండి పరి కల్పితధాన్యము లింటనుండి శ్రీ
రామకటాక్షవీక్షణ పరంపరచేఁ గడతేరెఁగాక ; మా
రామయమంత్రి భోజన పరాక్రమేమని చెప్పవచ్చు ? నా
స్వామియెఱుంగుఁ దక్కఁబళ చాతురి తాళఫల ప్రమాణమున్.

ఈ పద్యమును విని యందఱును నవ్వుకొనిరి. కలిదిండి కామయ్యగారి కుమారుఁడగు భీమన్న యను నాతఁడు తానుఁ గూడఁ గవిత్వమును తన మేనమామయగు శ్రీనాథునియొద్దనే నేర్చుకొనుచున్న వాడగుటం జేసి యా పద్యమునకుం బ్రతి పద్యము రామయమంత్రి రచియించినట్లుగా నర్థమిచ్చులాగున నీపై రచింతునా ? మామా ! యని యడుగఁగా " నోరి భీమన్నా ! యెంతవాఁడవయితివిరా ! నీవునాకు శిష్యుడవై యుండియు, విద్యాగంధము కలవాఁడవై యుండియు నీ కలవడిన నీ తండ్రి గుణములు మాత్రము విడువఁజాలకుఁటివిగా ? కొంటెగా ! మఱల నీవు నాపైఁ బ్రతి పద్యముం జెప్పదవుగా ! సరిసరి. " అని చెప్పుచు శ్రీనాథుఁ డచ్చట భుజించుచున్నవారితో వినుండని యీ క్రింది పద్యమును జదివెను.

ఉ. మా కలిధిండి కామయ కుమారకుండన్నిఁటఁ దండ్రివైఖరే !
కాక తదన్యమెట్లగును ? గాడిదకుం దురగంబు పుట్టునే ?
చేకొని కొంకినక్కకును సింగము పుట్టునె ? మాలకాకికిన్
గోకిల పుట్టునే ? చిఱుత కుక్కకు మత్త గజంబు పుట్టునే ?

ఈ పద్యమును విని యచ్చటి వారందఱును మేనయల్లుని యాక్షేపించు నీపద్యము సమంజసముగా నున్నదని నవ్వుకొనిరఁట.

## రే నా డు

పల్నాడులో రేనాడొక గ్రామము. శ్రీనాధు డీ యూరున కరిగినపుడు చెప్పిన పద్యము.

క. గరళము మ్రింగితినంచుం
బురహర ! గర్వింపబోకు ! పో ! పో ! పో ! నీ
బిరుదింకఁ గానవచ్చెడి
మెఱసెడి రేనాటిజొన్న మెదుకుల దినుమీ !

## మ స ర రా జ్య ము

ఉ. గొంగడి మేలుపచ్చడము కుంపటినల్లులు కుక్కమంచమున్
జెంగటవాయుతైలముల జీర్ణపుమందులు నుల్లిపాయలుఁ
ముంగిట వంటకట్టియల మోపులుదోమలు చీరపోతులున్
రంగ ! వివేకి కీమసరాజ్యము కాపురమెంత రోతరా !

ఉ. వంకరపాగలున్ నడుము వంగిన కత్తులు మైలకోకలున్
సంకటి ముద్దలుఁ జనుపళాకములుం బలుపచ్చడంబులున్
గోంకగు నోరచూపులును గూటికిదప్పిన యేసబాసలున్
అంకులబ్రహ్మ యీ మసరాజ్యము నెట్లు సృజించె నక్కటా !

## గు రి జా ల సీ మ

ఉ. ఆదరణంబు సున్న వినయంబు హితంబును బొంకు సత్యమా
లేదు దయారసం; బుహుళక్కి సాపాడువేళ పంక్తిలో
బెట్టుదురు భేదపుబెట్టు భిక్షమునైన వేయిరింతయున్-
జీదరగా జరించెదరు ; చీ, పులివాడు జనంబు లీశ్వరా.

## అ డి గొ ప్పు ల

క. గుడిమీఁది క్రోతితోడను
గుడిలోపలి నంబివారి కోడలుతోడన్
నడివీధి లంజెతోడను
నడిగొప్పుల యోరుగాలి నడిగితిననుమీ

## ప డ మ టి వ్యా పా రు లు

శా. దస్త్రాలున్ మసిబుఱ్ఱలుం గలములుం తార్కాణ్న చింతంబళుల్
పుస్తుల్ గారెడు దుస్తులుం జెమటకంపుంగొట్టు నీర్కావులున్
అస్తవ్యస్తపుంగన్నదంబును భయంబై తోచు గడ్డంబులున్
"వస్తూచూస్తిమిరో స్తిమిన్" బడమటిన్ వ్యాపారులంగ్రూరులన్.

## పు లి పా డు

పలనాడులోనే గురజాల నగరమునకు జేరువనున్న పులిపాడను గ్రామమున కొకతూరి శ్రీనాథుడేగి, యా గ్రామ కరణమగు శేషయ్యయు, బెద్దకాపగు హనుమయ్యయు, పుల్లారెడ్డియు ననాదరము చేయఁ గోపించి చెప్పిన పద్యము.

గీ. ఊరువ్యాఘ్ర నగరంబు మురగంబు కరణంబు
కాపు కపివరుండు కసపుదినెడు
గుంపుగాఁగ నిచట గురిజాలసీమలో
నోగెల్లఁగూడి రొక్కచోట.

శ్రీ నాథుని వీధి నాటకమునందు పద్యములు

## నె మ లి పు రి

శ్రీనాథ కవిసార్వభౌము డొకప్పుడీ నెమలిపురి కేగెను. ఆ యూరిలో నధికారబల సమన్వితుడును, శ్రీమంతుడును నగు బసివిరెడ్డియుఁ దక్కుంగల కాపులును దన్నుగౌరవము చేసిన సందర్భమున నిట్లు చెప్పెను—

క. నెమలిపురి యమపురముగా
యముఁడాయెను బసివిరెడ్డి యంత మిగులన్
యమదూత లైరి కాపులు
క్రమమెఱుగని దున్నలైరి కరణా లెల్లన్.

## ఎ త్తు కు పై యె త్తు

శ్రీనాథకవి రాజమహేంద్రవరములో నుండుకాలమున ఒక వీధిం బోవుచుండ ఒకయువతింగాంచి మోహించి బలాత్కరించబోయెనట. అంత నా అబల యిప్పుడు సమయముకాదు. అమావాస్యనాడు ఫలానాచోటకు రమ్మని చెప్పెనట. ఆ ముహూర్తమునాటి రేయి వచ్చియు. నీతని మోసగించి యా కారుచీకటిలో మాయమైపోయినదట. అప్పు డామెనుగూర్చి యిట్లు చెప్పెను.

ఉ. హా జలజాక్షి హా కిసలయాదరి హాహరిమధ్య హా శర
ద్రాజనిభాస్య హా ప్రమదమంత్ర కళానిధి యెందుకు బోయితే
రాజమహేంద్రవీధి గవిరాజు ననుంగికురించి భర్గకం!
రాజిత కాలకూటి ఘటికాంచితమైన యమాస చీకటిన్.

## పతితురాలు

ఒక వూరిలో ఒక పతితురాలుతో కూడుటకు పోవుచుండ ఒక స్నేహితుడు రోగములపుట్ట యని యక్కడకు వెళ్ళకుండ వారించెనట. అప్పుడు యీక్రిందివిధముగా నొక పద్యము జెప్పెను.

ఉ. గండము దప్పె నాంధ్రకవిగానికి నిన్నరెయి పుష్పకో
దండుని గారవింపకయ తద్దయనిల్చితిగాని యయ్యయో
బందరువారి పాపికిని బైటిపసారమె యట్టిమయం
బుండయి యెల్లివంక జెడిపోవుదుగా యటు పోయియుండినన్

## తెలుకలస్త్రీ

శ్రీనాథునిగూర్చి యీక్రింది యిహాతిస మొకటి పెద్దలు చెప్పుదురు. ఇది యెంతవరకు సత్యమో పాఠకమహాశయులే యూహించు కొందురుగాక.

శ్రీనాథు డొకనాడొక తెలుకలదానిని జూచి దానిని వరించి యామెకు తన యభీష్టం బెరింగించుకొనెనట. ఆమె యాతని కోరిక యనుమతింపలేదట. అప్పుడాత డామె ననేక విధంబుల బ్రతిమాలి సమ్మతింపుమని ప్రాధేయపూర్వకముగా కోరెనట. యెట్టకేల కామె కొంత బెట్టుసరితో నొప్పుకొనెనట. ముందాతని కోరిక తిరస్కరించిన తరువాత నంగీకరించుటచే యాతని కామె యెడ కొంచము సంశయము గలిగి యచ్చటనున్న కాళికా యాల యములోనికి దానిని దోడ్కొనిపోయి 'సాయంసమయమునకు

తప్పక వచ్చెద' నని యా కాళికాదేవి శిరముపయి చేయినుంచి ప్రామాణికము చేయుమని కోరెనట. ఆమెయు నాతని కోరిక కనుగుణ్యముగా బ్రామాణిక మొనర్చి యప్పటికా గండము తప్పించుకొని పోయినదట.

అనుకొన్న సమయమునకు సరిగా శ్రీనాధుడు కాళికాలయ మున కరిగెను. తెలుకుల దింకను రాలేదు. ఆమె యిప్పుడే వచ్చునో యికనే వచ్చునో యని పాప మాతడు నిద్రగూడ మాను కొని యర్ధరాత్రంబు వరకును నిరీక్షించి యుండెనట. కాని యా వనిత రానేలేదు. అప్పు డా కవికి కోపము వచ్చినది. కోపము వచ్చినమాత్ర మిత డెవరి నేమనగలడు ? ఏమియు జేయునది లేక కాళికాదేవిమీద నీ పద్యము జెప్పెనట—

చ. గొరియల మేకపోతులను కొమ్ముపొటేళ్ళను గావుగొందు వీ
వరయగ సందెకాడ దగవత్తునటంచు భవచ్ఛిరంబుపై
గరమిడి పోయినట్టి తిలఘాతుకురాలి తదీయ....
పెరుకగలేవు నీవు నొక భీకరమూర్తివె కాళికేశ్వరీ !
అని తిట్టి పోయెనట.

## శ్రీ రంగం వైష్ణవ నారి

శ్రీనాధుడు శ్రీరంగమున కరిగి, యొక వైష్ణవభామినిం జూచి చెప్పిన పద్యము—

సీ. ఒక చెంప కోరగా నొనగూర్చి దిద్దిన
తుఱుమునసుండి క్రొవ్విరులు రాల
రాతిరివిదుర గూరమిజేసి ముడివడు
బడలిక నడుగులు తడబడంగ

వింతవారల జూచి వెసనవ్వు నెడగప్పు
గల దంతముల కాంతి వెలికి బాఱ
చిడిముడి నడచుట జెలరేగి గుబ్బల
పైదాకి యొక్కింత పైటజాఱ

గీ. చెమటచే దిరునామంబు చెమ్మగిల
హాళిడాచేత విడియంబు గీలుకొల్పి
రంగపురి రాజవీధి గానంగనయ్యె
నాదుమది గోర్కులూర వైష్ణవ వధూటి!

## గొ ల్ల బా లి క

శ్రీనాథు డద్దంకి కరిగినపుడు గాంచిన యొకస్త్రీనిగూర్చి యీ విధముగా వర్ణించెను——

సీ. తళ్కుతళ్కనుకాంతి బెళ్కు కెంపులముంగ
రందమై కెమ్మోవియందు గుల్క
ధగధగద్ధగలచే దనరారు బంగారు
గొలుసు లింగపుగాయ కొమరుమిగుల
నిగనిగన్నిగలచే నెగడు చెంగల్వపుగుబ్బ
దోయియొండొంటితో రాయిడింప
రాజహంసవిలాస రాజితంబగుయాన
మందుమెట్టెలు రెండు సందడింప

గీ. సరసదృక్కుల విటులను గరజూచి
పొందికై నట్టి మోమున భూతిరేఖ
రాజకళ లొప్ప నద్దంకి రాజవీధి
బొలిచె నొక కొమ్మ గాజుల ముద్దుగుమ్మ.

## కుమ్మరి బాలిక

ఉ. కుమ్మరి వారి బాలిక చకోర విలోచన ముద్దుగుమ్మ యా
వమ్మదటీన్ రసాలమలిన వస్త్రము చెంగులు జాఱగట్టి తా
గమ్మనిమ్రోతతోఁ గరనఖమ్ముల భాండములంగజాస్త్ర పా
తమ్మన బ్రోవుదీసె విటతండము గుండియలార విచ్చగన్

## జంగమువారి చంద్రముఖి

శా. దాయాదుల్ వలె గుబ్బచన్ను లొరయఁగా ధావళ్యనేత్రాంబుజ
చ్ఛాయల్ తాండవమాడగేరి పురుషస్వాంతమ్మునన్ మన్మథుం
దేయం జంగమువారి చంద్రముఖి విశ్వేశార్చనా వేళలన్
వాయించెం గిరిగిండ్లు బాహు కుళల వ్యాపార పారీణతన్.

## సాలె బాలిక

ఉ. వాలగు కన్నుదోయి బిగివత్రువగుబ్బలు కాఱుచీకటిం
జాలహసించు కొప్పుజిగి సారసపున్నగు మోముగల్గునా
బాలిక గూలికమ్ముకొన బట్టలు నేసెడు వారికిచ్చె హా
సాలెత గాదురా కుసుమసాయకు పట్టపుదంతి యింతియే.

## బియ్యపు దంపు కామిని

ఉ. పువ్వులు గొప్పునం దురిమి ముందుగ( గొనసియాడుచుండగా
జెవ్వన( గాలుచాచి, యొకచేతను రోకలిబూని యొయ్యనన్
నవ్వుముఖంబుతోడ దననందను( బాడుచు నాథు(జూచుచున్
నువ్వియనువ్వియంచు నొకసుందరి బియ్యముదంచెముంగిటన్.

## పిండి రుబ్బు టి

సీ. తాటంకయుగ ధగద్ధగిత కాంతిచ్ఛటల్
చెక్కుటద్దములపై జీరువాఱ
నిటలేందు హరి నీలకుటిల కుంతలములు
చిన్నారి మోమున( జిందుద్రొక్క
బంధురమౌక్తిక ప్రకట హారావళుల్
కులుకు గుబ్బలపై గునిసియాడ
కరకంకణ క్వణక్వణ నిక్వణంబులు
పలుమాఱు రాతిపై బరిఢవిల్ల

గీ ఓరచూపుల విటచిత్తమూగులాడ
బాహుకుశలత జక్కని మోహనాంగి
పాటపాడుచు గూర్చుండి రోటిమీద
పిండి రుబ్బంగ గన్నుల పండువయ్యె.

# సింహాచల యాత్ర

(నానాజాతుల స్త్రీలను వర్ణించుట)

## వేపారాంగన

సీ. విడినకొప్పున జాజివిరు లొప్పుగారాల
జిట్టికుంకుమచుక్క బొట్టుపైచెదర
చక్కగా బటువారు సందెడు కుచ్చెళ్ళు
చెలగి మెట్టియలపై జిందులాడ
కొదమగుబ్బల బైటకొంగు సయ్యనజార
ముక్కు నత్తొకవింత ముద్దుగుల్క
మొలగంట లిమ్ముగు మ్రోతతో రంజిల్ల
గనకంపు టందియల్ ఘల్లురనగ

బొసగ గప్రంపువీడెముల్ పొందుపరచి
యనుగు జేడెలతో ముచ్చటాడుకొనుచు
నలరు సింహాద్రిపైకెక్కి హర్షమునను
వచ్చె గలకంఠి వేపారి మచ్చకంఠి.

శా రాపాడంగల గుబ్బచన్నుగవతో రాకేందు బింబంబుపై
దూపేయంగల ముద్దునెమ్మొగముతో దోరంపుమైచాయతో
జూపున్ ముద్దులబాల సంఘములతో సొంపారు లేనవ్వుతో
వేపార్యంగన వచ్చె గానెబిగితో వేణీభరచ్ఛాయతోన్.

సీ. పలుతెరంగులరంగు పద్మరాగలవేణి
చకచకత్ప్రభల సాక్షాత్కరింప
సొంపుతో రవచెక్కడంపు ముంగరచాయ
పగడంపు మోవిపై బరిఢవిల్ల
విటిసి యోసరిలి కిక్కిరిసిన చనుదో
బిగువు నెరరైక పిక్కటిల్ల
ఒకపరి యొయ్యారి ముసుగులో నెలవేణి
కొమరాలి మూపున గునిసియాడ

గీ. విరులతావియు నెమ్మేని వెనుకవచ్చ
పెళపెళక్కను చిఱుతొడల్ బెళుకునడుము
వలుద పిఱుదులు కలికి చూపుల బెడంగు
లొలయ గన్గొంటి వేపారి కలువకంటి.

## నంబి పడుచు

కం. రంభాస్తంభము లూరువు
లంభోరుహనిభములకు లతమ శరంబుల్
జంభాసురారి. మదగజ
కుంభము లీ నంబివారి కోడలు కుచముల్.

కం. అద్దిర తళుకులు బెళుకులు
నిద్దంపు మెఱుంగుదొడల నీటులు గంటే
దిద్దుకొని యేల వచ్చును
ముద్దియ యీ నంబిపడుచు ముచ్చటదీఱన్.

వారి వెనుకనే సానపట్టిన నవాకవోలె మిసమిస లాడు నొక భాసుర గాత్రిం జూచి రూపురేఖా విలాసాదులం బట్టి యగసాలి కాంత యని ఊహించి——

సీ. పొఱపొందగ విభూతిబొట్టు నెన్నొసలిపై
దళుకొత్త చెమట కుత్తల జెలంగ
సొగసుగా బూదండ దోపిన కీల్గొప్పు
జాఱగా నొకచేత సరుదుకొనుచు
బిగిచన్ను గవమీద బిరుసు పయ్యెద సెంగు
దిగజాఱి శివసూత్ర మగపడంగ
ముక్కున హురుమంచి ముత్యాల ముంగర
కమ్మనా తెఱమీద గంతులిడగ

గీ. కౌను జవ్వాడ మట్టియల్ గదిసిమ్రోయ
గమ్మవిలుకాని జాళువా బొమ్మయనగ
మెల్లమెల్లన సింహాద్రిమీది కేగ
గన్నె పూబోడు యగసాలి వన్నెలాడి.

తంబురా చేతబట్టుకొని నృసింహస్వామిపై గీతికలు బాడుచు వచ్చుచున్న నొక సాతానివెలదిని గాంచి యామె భక్తి మార్గమున కనువైషంబున నుండుకునికి యా బోటిపై జెప్పినది :——

సీ. మీగాళ్ళ జీరాడు మేలైన కుచ్చెళ్ల
తీరున మడిచీర దీర్చికట్టి
బిగువుగుబ్బలమీద నిగనిగల్ దళుకొత్తు
నోరపయ్యెద కొంగు జాఱవైచి
వలపల కొకవింత గులకఁ గొప్పులా
కురులు సున్నగదువ్వి కొప్పువెట్టి
నెలవంక నామంబు నీటు మీరగదిద్ది
తిరుచూర్ణ మామీద దీర్చిపెట్టి

గీ. ఓరచూపుల విటుల దానూరడించి
గిల్కుమట్టెల రవరవల్ గుల్కరింప
జిలికిచేసిన తామ్రంపు జెంబుబూని
వీధి నేతెంచి సాతాని వేడ్కలాడి.

జంగమ కాంతను జూచి :—

సీ. బాలేందురేఖ సంపదమించి విలసిల్లు
నొసటి తళ్కులనీటు నూఱుసేయు
భ్రమరికా హరినీల చమరవాలములబోలు
వేణీభరము చాయ వేయిసేయు
దర్పణ ద్విజరాజ ధాళధళ్యప్రభ
లపనబింబనస్ఫూర్తి లక్షసేయు
కోకహాటకశైల లుంఠి కుంభారాతి
కుచకుంభ యుగళంబు కోటిసేయు

గీ. జఘన సీమకు నిలువ లెంచగవశమె
దీని సౌందర్య మహిమంబు దేవుడెఱు(గు
నహహ! యెబ్బంగి సాటిసేయంగవచ్చు
భావజునికొల్వు జంగభామచెల్వు.

## ఆంధ్రనియోగి కాంత

సీ. హరినీలముల కప్పులడగించు నునుగొప్పు
విడపువ్వు దండతా వీడబార
కోటిచందురుడాలు గోటమీటగజాలు
మొగము గుంకుమచుక్క సొగసుగులుక
అలజక్కవలజిక్కు లణగద్రొక్కగ నిక్కు
పాలిండ్లపై నాచు పైటజార
ఇసుకతిన్నెలమెట్టు పసిడిచెంపలగొట్టు
బిరుదుపై మొలనూలు బెళకుదేర(
గీ. చిగురు కెమ్మోవి బగడంపు జిగియు మెరయ
మాటలాడగ గనుదోయి తేటలమర
జెమట లూరంగ సింహాద్రి చేరవచ్చె
భోగగుణధామ యాంధ్ర నియోగిభామ.

## బొందిలిభామ

ఉ. వన్నెలగాగరా జిలుగువల్లువ కుచ్చిళులందు నాదముల్
సన్నపు వారిభంగముల నందున వీచెడు బాలకూర్మి మున్,
గన్న తెఱంగదోప గరకంజములన్ ముసుగున్ బిగించి ప్ర
చ్ఛన్నముఖాబ్జమై నడచెసందున బొందిలి భామ గోమునన్

## దాసరికాంత

ఉ. వాసనకల్గు మేను నిడు వాలుకనుంగవ గబ్బిగుబ్బలున్
కేసరి ముధ్యమున్న గదన కేశిక నింపగు బాహుమూల వి
న్యాసము గల్గినట్టి యెలనాగను బోగముదాని జేయ కా
దాసరిదాని జేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా.

## నియోగి సుందరి

క. బంగారమువంటి మేనును
శృంగారము లొల్కు కుల్కు చక్కని చన్నుల్
బంగారపు నెఱచీరయు
చెంగటచూపులు నియోగి చెడియ కొప్పుఁగా.

## వైశ్యకాంత

చ. పురుషుడు గూడు వేళ బెడబుద్ధులు సుద్దులు కానిచేతలున్
సరగున మేనికంపు చెడు చందపురూపము నేహ్యవస్త్రమున్
బరగు నిరంతరంబు నెడబాయనిసౌఖ్యము లేని ప్రేమయున్
విరహపు జూడ్కు లుమ్మలిక పీడక జెల్లును వైశ్యభామకున్.

## యాంధ్రవనిత

చ. గురుకుచయుగ్మ మానసము కోమలికంబులు మొద్దుమాటలున్
అరుపు లతిప్రసంగములు నప్పటప్పట మేలుమాటలున్
దరిత కళానిధానము తాడనపీడన బూతుమాటలన్
బరువడి నొందనేర్చు ప్రియభాషలు గల్గనె యాంధ్రభామకున్.

## శూ ద్ర వ ని త

మ. వరగంభీర పయోధరంబులు గుణా భావప్రవీణత్వ మ
య్యర విందాస్య సుగంధ గంధపటు వేణ్యత్యంత సౌందర్యము
ద్దురితంత్రాణ వివేకసంపదయు మాధుర్యాది గాంభీర్యముః
దరుణీరత్నము శూద్రభామ గుణము ల్తథ్యంబె వర్ణింపగన్.

## వ డ్డి యు వ తి

సీ. మకరధ్వజుని............
............చిగురుబోడి
యుభయ కక్షములందు నురు దీర్ఘతరములౌ
నెరులు పెంచన దయా నీలవేణి
పసుపువాసనగ్రమ్మ పై చేలము లెస్స
ముసుగు బెట్టినదయా ముద్దుగుమ్మ
పూర్ణచంద్రుని గేరు పొలపు సింధూరంపు
బొట్టు పెట్టినదయా పొలతి నుదుట
గీ. యెమ్మెమీఱంగ నిత్తడిసొమ్ము లలర
యోరచూపున శృంగార మొల్కుచుండ
గల్కి యేతెంచి మరునిరా చిల్కయనగ
వలపులకు పేటి యొక యొడ్డె కులవధూటి.

చ. విటకర ఖండివాది పరవేదనకోటి శరీరజన్మ హృ
త్తటమున వ్రాలిపోవగను తద్దయు బోవగ నాభిగాంచ య
చ్చట పటుదీర్ఘ దండహతి చాల విరోధమటంచు దెల్పినన్
దటుకున బోక నిల్చిన విధంబుననుండె కుచంబు లింతికిన్.

సాధారణముగా తీర్థములలోనను గొప్ప గొప్ప యుత్స వములలోనను సరుకు లమ్ముటకై సిగ్గు బిడియములు లేని యువతులను గూర్చుండబెట్టుటవలన మామూలుకన్న సరుకె క్కువ ఖర్చుపడునని వారి యాశయము. అట్లే యీ తీర్థములలో గూడ చాల దుకాణములపై స్త్రీలే కూర్చుండి విక్రయించుచుండిరి,

చ. తొలకరి మించు దీవగతి దోప దుకాణముమీదనున్న య
య్యలికులవేణితో దములపాకులభేరము లాడబోయి నే
వలచుట కేమి ? శంకరునివంటి మహాత్ముడు లింగరూపియై
కలికి మిటారి గబ్బిగుబ్బల సందున నాట్యమాడగన్.

వైశాఖ బహుళ అమావాశ్యరు సింహాచలములో తీర్థము జరుగును. అకాలములో మామిడిపండ్లు బాగుగా దొరుకును. ఆ దినమున మామిడిపండ్లమ్ముకొనుచున్న యువతిని జూచి—

ఉ. అంగడివీధి బల్లవుల కానగ మామిడిపండ్లుమ్ముచున్
జంగమువారి చిన్నది పిసాళితనంబున జూచెటో నిశా
తాంగజధారణ కైరవసితాంబుజ మత్తచకోర బాలసా
రంగతటన్ని కాయముల రంతులుచేసెడి వాలుచూపులున్

అకాలములనున్న మిఠాయి దుకాణములు జాలవరకు బొందిలి వారివే. ఇప్పుడుగూడ నక్కడక్కడ బొందిలి దుకాణ ములు గలవు. అప్పుడొక దుకాణముపై నున్న దొందిలి యువతిం జూచి—

మ. విమలాంభోరుహ పత్రచిత్రములుగా బెంపారునేత్రమ్ములన్
గమనీయంబగు గజ్జలం బునిచి రేఖాసౌష్టవం బొప్ప నా
గముతో జేసినసిందురంబు నుదుటన్ గాన్పింప బయ్యెంటయున్
యమునాతైకయుదాటి గుబ్బచన్ను లొయ్యారంబుసూపన్ దుకా
ణముపై బొందిలిదోర్తు నిల్చె ముఖచంద్రస్ఫూర్తి శోభిల్లగన్.

## బ్రాహ్మణ యువతి

చ. గురుకుచముల్ బ్రియోక్తులును క్రొమ్ముడియున్నిలలాటకంబులున్
మురిపెపుమాటలి న్నగవు ముద్దుల మోమును గల్గుకాని యా
సురతపు నేర్పు మాటలును సూక్ష్మవిభీషణ భాషనంబులున్
బరువడియె విభుంగవయు భావము బుట్టదు విప్రభామకున్.

## జంగమురాలు

క. చెవులవి సీలపురాలా!
యువిదరొ నిను రతుల దలుప నొకని పరాలా!
యివి రుద్రాక్షరాలా!
జవరాల! మహాత్మురాల! జంగమురాలా!

## పద్మసాలె వింటారి

సీ. పడుచేయుచో జూచు గుడియెడమలయందు
సంచరించెడి విట సముదయముల
బోగులు కట్టుచో బొరిగిండ్ల చిన్నప్రా
యపు టంతులకు నుపాయములఁ దెల్పుఁ

గుండెలు చుట్టుచో గన్ప్రొమ సైగతో
సొగసుకాంద్రఁ కుడెంకి చోటుజూపు
అచ్చు లేయుచో హాస్యరసంబున
జెలికత్తెలను మూరు పలుకరించు

గీ. నావలీవలి పతులతో హాస్యమాడు
మోకు బిగియించుచో బతి మోసపుచ్చు
గుంచెపిడి వట్టి యీడ్చుచు గొమిరు మిగుల
పద్మసాలెది వగదేటి బలుమిటారి.

## సుందరి

సీ. సొగసుకీల్జడదాన సొగసు కన్నులదాన
వజ్రాలవంటి పలువరుసదాన
బంగారు జిగిదాన పరువుగుబ్బలదాన
నయమైన యొయ్యారి నడలదాన
తోరంబుగటిదాన తొడల విగ్గులదాన
పిడికిట నడగు నెన్నడుముదాన
తళుకు జెక్కులదాన బెళుకు ముక్కులదాన
సింగారి కనుబొమ చెలువుదాన

గీ. మేలిమి పసిండిరవ కడియాలదాన
మించిపోనేల రత్నాలమించుదాన
తిరిగి చూడవె ముత్యాలసరులదాన
చేరి మాటాడు చెంగావి చీరదాన!

సీ. శ్రీరస్తు భవదంఘ్రి చికురంబులకు మహా
భూర్యద్ధములు సితా భోజనయన !
వరకాంతిరస్తు తావక ముఖనఖముల
కాచంద్రతారకం బబ్జవదన !
మహిమాస్తు నీకటిమధ్యంబులకుమన్ను
మిన్నుగలవాళ్ళ మించుబోడి !
విజయోస్తు నీగానవీక్షలకానీల
కంఠహరిస్థాయిగా లతాంగి !

గీ. కుచలమస్తుల సచ్చాత కుంభకుంభ
జంభభిత్కుంభి కుంభాభిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు
మందరములుండు పర్యంత మిందువదన !

సీ. చక్కని నీముఖ చంద్రబింబమునకు
గళ్యాణమస్తు బంగారుబొమ్మ
నిద్దంపు నీ చెక్కుటద్దపురేకకు
నైశ్వర్యమస్తు నెయ్యంపుదేవి
మీటిన బగులు నీమెఱుఁగు బాలిండ్లకు
సౌభాగ్యమస్తు భద్రేభయాన
వలపులు గులుకు నీవాలుగన్నులకు న
త్యధిక భోగోస్తు పద్మాయతాక్షి

గీ. మధురిమము లొయ్య నీ ముద్దుమాటలకును
వైభవోన్నతిరస్తు లావణ్యసీమ
వన్నెచిన్నెలు గల్గు నీ మన్ననలకు
శాశ్వతస్థితిరస్తు యోషాలలామ!

క. కుంకుమలేదో! మృగమద
పంకములేదో! పటీల పాంసువులేదో!
సంకుమదములేదో! యశు
భంగకరమగు భస్మమేల! బాలా! నీకున్!

## రా చ వీ డు

చ. పసగల ముద్దుమోవి బిగిస్రువ గుబ్బలు మందహాసమున్
నొసట విభూతిరేఖయు బినుంగున తావి మిటారి చూపులున్
రసికులు మేలుమేలు భళివరా యని మెచ్చగ రాచవీటిలో
బసిడి సలాకవంటి యొక బల్జపఘాటిని గంటి వేడుకన్.

## చా క లి యు వ తి

ఉ. శ్రీకరభూషణంబులును సిబ్బెపుగుబ్బలు ముద్దు చెక్కులన్
గోకిలవంటి పల్కులును గొల్చిన జేరలగేరు కన్నులున్
ప్రాకటమైన కాంతియును బంగరు బొమ్మకు హెచ్చువచ్చు నీ
చాకలివారి జవ్వనికి సాటిలరారిక దొంటి జవ్వనుల్.

## నగసాలి

ఉ. తల్లియు కొండపల్లి నొక తామరఖండిక నీళ్ళకేగగా
తెల్లని చీరకొంగు నెగదీసుక నవ్వుచు నీళ్ళుచేదగా
గొల్లల లింగకాయ చనుగుబ్బల నందున నాట్యమాడగా
జల్లని మాటలాడు నగసాలి శిరోమణి జూచితే సఖా!

ఉ. బంగరు లింగకాయ చనుబంతులమధ్య నటింపుచుండగా
జెంగులిజాఱ మేల్విలువ చీరయు వీడ మదీప్సితంబు లు
ప్పొంగగ వామహస్తమున బొల్పగు నీవినిబట్టి వేడ్కతో
జెంగున గోడదాటె నగసాలి శిరోమణి జూచితే సఖా!

## రెడ్డిబాలిక

ఉ. విడిబడినట్టి వేణియటె బిర్రునవ్రాలిన యంతలోన దా
వడినెల చేత బట్టుకొని వటువ గుబ్బల పైట జారగా
వడల వణంకగా బిరుదు నాట్యము సేయగా వీని వీడగా
దొడదొడ మంచెనెక్కె నొక దొడ్డమిటారపు రెడ్డిబిడ్డహో!

## నంబికాంత

క. నడినూక లేనియన్నము
వడిబోసిన నెయ్యి బుడమ వరుగుఃజ బెరుగున్
గడిమాడ సేయబెట్టిన
నడగూడెపు నంబిపడుచు నడిగితి ననుమీ!

## ఒక పద్యమున

ఈ పద్య మెప్పు డే సందర్భమున జెప్పెనో తెలియదు.

క. నిబ్బరపు కలికి చూపులు
జెబ్బించుక లేని పిరుదు సన్నని నడుముస్
మబ్బు కురు లుబ్బు కుచములు
బిబ్బీలకుగాక గలవె పృథ్వీస్థలిలోన్.

## భోజనము

ఈతడా పల్నాటిసీమలో నొకరియింట నొకరాత్రి భోజనమున కుండిపోయెను. వీరును జొన్నయన్నమే పెట్టుదురని యాతడిదివరకే యెరుంగును, కాని యేమియు ననుకొనకుండ దినుటకు ప్రారంభించెను. కాని యా జొన్నయన్నమయినను సరిగాలేక దాని నిండ యిసుక వున్నదట. దానికితోడు తొలుత వడ్డించిన యరతులము పచ్చడేగాని మరల మారయినను వడ్డించలేదట. పాప మాతడా యన్నము దినలేక :—

ఉ. మూతిని ముట్టగా వెరతు ముద్దకు ముద్దకు గూటిలోపలన్
బాతికపాలు సైకతము పచ్చడి కొంచెమె యాదియంత్యమున్
జూతమటన్న లేదుమరి సున్నముకన్నను మెత్తనన్న మీ
రాతిరిబోలె భోజనమరాతికి నైననువద్దు దైవమా!

ఆ. వె. పూర్వమందు విషము పుచ్చుకొన్నానని
గర్వపడెదవేల కాలకంఠ
కొండవీటిసీమ బండు జొన్నకూడు
దిన్న నీదు పస దేటపడును.

## ధైర్యము చెప్పుకొనుట

ఒకనాఁ డితని కిట్టిభోజనమే సంప్రాప్తింపగా జేయునది లేక విస్తరిచెంత గూర్చుండి యిట్లు ధైర్యము జెప్పుకొనెను.

సీ. కఠినంపు జొన్నల కటుకు కుడుములు సూచి
వక్త్రమా ! భయపడవద్దుసుమ్మి
నానారుచుల్ గోరు నాలుకా ! నీవేమి
సందేహ పడవద్దు చవ్వరింప
ఎన్నడు గడిచేయు నెరుగనెట్లో యని
కుడిహస్తమా ! నీవు జడియబోకు
కమ్మనవాసనల్ గ్రక్కున త్రేన్పెడి
గర్భమా కుటకుట కాకయుండు
గీ .... .... ....
.... .... ....
వచ్చె బహుధాన్యనామ సంవత్సరంబు
కాయగూరలు మనకు నిక్కముగ గల్గు.

## ప్రౌఢదేవరాయుల యాస్థానమున

తనకు జయము లభించిన పిమ్మట శ్రీనాథుఁ డీ పద్యమును జెప్పెనట.

మ. జననాథోత్తమ దేవరాయ నృపతి చక్రేశ శ్రీవత్సలాం
ఛనసంకాశ మహాప్రభావ హరిరక్షాదక్ష నాబొటికిన్
గునృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగా
గనకస్నానము జేసి కాక పొగడంగా శక్యమే దేవరన్.

శ్రీనాథుని కోరికపైన కనకస్నాన మహోత్సవము జరిగినదట. అప్పుడీ పద్యముచే దేవరాయలను స్తుతించినాడట.

శా. జోటీభారతి యార్భటిన్ మెఱయుమీ చోద్యంబు గానేను గ
ర్ణాటాధీశ్వరు బ్రౌఢదేవరాయ నృపతిన్ నాసీరఘాటీచమూ
కోటీఘోటక ఘట్టితాఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీధూత ధరారజశ్చుళుకితాం భోటిన్ బ్రశంసించెదన్.

# వి వా ద ము

రాజమహేంద్రవరమున పండితులతో వివాదపడి చెప్పిన పద్యము

మ. శ్రుతిశాస్త్రస్మృతు లభ్యసించుకొని విప్రుండంత నానాధ్వర
వ్రతుడై పోయికనున్ బురందరపురా రామంద్రుదుమానల్ప
కల్పతరుపాంత లతాకడుంగసుఖ సుప్తప్రాప్త రంభాంగనా
పతి....కురపాట పక్రమకళా పాండిత్య శౌండీర్యమున్.

# మాదయ లింగమనేడు

వెలుగోటి మాదయలింగమనే డొకమా రేదియో కారణమున కఠారిని బట్టుకొని నిజస్థానంబునకు బోయెను. కఠారి శాత్రవుల పాలయిపోవుటచే రెడ్లకు తల కొట్టినట్లుండెను. కాని యేమి చేయగలరు? అప్పుడు శ్రీనాథుడు తిన్నగా వెలుగోటి మాదయ లింగమనేని దర్శనమునకు బోయి యాతనిని గాంచి:—

సీ. జగన్నాథగండాక సంగ్రామ నిశ్శంక
జగతీశ రాయవేశ్యాభుజంగ
అఖిలకోటలం గొన్న యరిరాయ మదభంగ
మేలందు ధరాణీశ మీనజాల
మూరురాయరగండ మరియు రాజులమిండ
యభివృద్ధిమీరు చౌహత్తమల్ల
ఘనకాయ గోపాళ కామినీపాంచాల
బ్రహ్మయు శశివంక పరశురామ

గీ. దండిబిరుదుల సురతాణి గుండెదిగులు
భళిర యల్లయదేముని పరగమిండ
రమణ మించిన మించినమేదిని రావుబిరుద
సంగరాటోప మాదయ లింగభూప !

ఇంకా నెన్నియోవిధంబుల నాతని నభినందించి తుద కాతని వలన నా కతారిం బడసి తమ భూపతి కందజేసెనని పెద్దలు జెప్పెదురు.

శ్రీనాథుడు రాజమహేంద్రవరమున మార్కండేయ నార శింహదేవుని నిట్లు వర్ణించియున్నాడు.

సీ. కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
శ్శశిచంద్రికాధౌత సౌధవీధి
గోదావరీ పుణ్యకూలం కషాజల
స్ఫారిత శ్రీరుద్రపాద యుగళి

బలవదభ్యున్నత ప్రకారపరివేష్టి
గండూషి తాజాండ మండలంబు
గంధ దంతావళ గ్రైవేయ ఘంటికా
ఠంకారముఖర ఘంటాపథంబు

గీ. రాజబింబాననా నూత్నరత్నపేటి
వీరరాహుత్త సుభట కంఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

## శ్రీనాథుని చరమ దశ

వీరభద్రారెడ్డి గతించిన పిదప కొన్ని సంవత్సరము లెట్లో కాలము గడపి యించుమించుగా 1453 సం॥ర ప్రాంతమున దివం బలంకరించెను.

ఈతడు చనిపోవుటకు ముందీ క్రిందిపద్యమును జెప్పుకొనె నని వాడుకగా నున్నది.

సీ. కాశికావిశ్వేశు గలసె వీరారెడ్డి
రత్నాంబరములే రాయడిచ్చు
నంభగూడె దెనుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కేరాజు ప్రస్తుతింతు
స్వర్గస్థుడయ్యె విస్సన్నమంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలుగు
కైలాసగిరి బండె మైలారువిభుదేగి
దినవెచ్చ మేరాజు దీర్పగలడు.

గీ. భాస్కరుడు మున్నె దేవుని పాలికరిగె
కలియుగంబున నికనుండు గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి.

ఇంకా నీ కవిసార్వభౌమునిచే రచింపబడిన గ్రంథములలో కొన్ని పద్యరత్నముల నుదహరించెద.

## శృంగార నైషదము

సీ. జగము లొక్కమ్మడి సాధింపనెత్తిన
రతిమన్మథుల విండ్లు రమణి బొమలు
కాంతినిర్ఝరమిదు కామ యౌవనముల
కుంభప్లవము లింతి కుచయుగంబు
నడుమింతయని కేలదొడికి పట్టినధాత
యంగుళి రేఖలాబ్జాస్యవళుల
యువమనో మృగరాజు దవిలింప దీర్చిన
మదనవాగుర లిందువదన కురులు

గీ. బాల్యతారుణ్య సీమావి భాగమునకు
నజుడువ్రాసిన రేఖ తన్వంగియారు
భావవరమున బడసిన పంకజముల
యుపరజన్మంబు పూబోణి యడుగు లదిపా!

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబు నంగేళికా
నసంక్రందనపట్టణ ప్రకటజన్మస్థానలన్ రంభలన్
ధనదాంపత్యతపః ఫల స్తనుల నత్యంతాధి రామాంగునన్
మనుజాధీశ ! యధఃకరించు బొఁగడన్ మాబోంట్లకు శక్యమా!

శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికాసౌరభ
శ్రీలుంటాకము చందనా చలతట శ్రీఖండసం వేష్టిత
వాలస్ఫార ఫణాకఠోరవిష నిశ్వాసాగ్ని సాంధీంధమం
బేలా నాపయి దక్షిణానిలము ? పక్షీ ! సేయు దాక్షిణ్యముల్.

సీ. చెలువారు క్రామించు నిలువుటద్దములలో
ప్రతిబింబములు కానబడుట కతన
సికతామయం బైన సీమాంతదంబున
బాదపద్మంబు లేర్పడినకతన
నవలోకమునుబోలె నాకస్మికం బైన
యంగాంగసంస్పర్శ మైన కతన
దిక్పాలు రొసగిన దివ్యపుష్పంబుల
బహుళంబగు సౌరభంబుల కతన

గీ. విరహ విభ్రాంతి నొక్కొక్క వేళలందు
గళవళపు వింతభాషల కతననప్పు
డెవ్వడో యొక్క మాయావి యేగుదెంచె
నంతపురమున నకనిలోఁగి రబ్జముఖులు.

ఉ. ఈ గఁరాఁగామిని మదేతదయోగధర ప్రభూత మా
ర్గాగత ఘేదరాత్రి సమయాపధిఘాత విధాతసంధ్య కా
లాగరుచిత్రకాంధ తమసాంశ సమన్విత జంభవైరికా
షాగతరాగకర్త్రి ప్రకట ద్విజసేవితయౌట చిత్రమే!

## సాయంకాల వర్ణనము

ఉ. కోమల తామ్రచూళికల క్రొవ్వెఁజసంజకు బ్రోదివెట్టి ని
స్సీమ కఠోరతారరుతి జెట్టుపలార్చుచు నుబ్బులెత్తి వి
శ్రామపోలెగూనె విలసచ్ఛ రమాచలకూట పక్కణ
గ్రామశిఖాకుటీర శిఖరంబుల గుక్కుట చక్రవాళముల్.

## హ ర వి లా స ము

సీ. క్రొమ్ముడికై పెక్కు కుసుమంబు లుమియుచు
నమటి ప్రదేశమునందుఁ జొరలు
జేపుఁడించిన లేత చెక్కుటద్దంబుల
దాటంకయుగళంబు దన్నియాడ
నాక్రోశపరిదేవతాక్షర వ్రాతంబు
కంఠగద్గదికచే గ్రక్కుపడగ
హరినీలములచాయ నక్షిగోళమ్ముల
సొబగుగా గన్నీటి సోనగురియ

గీ. ముత్తియంబుల పేరులు ముసిలిపడఁగ
హస్తములవీగు చనుదోయి నణచుకొనుచు
సంబెరఁ బిచ్చె రతి దేవిశంబరారి
కమలినవసంతు నుదుట దుఃఖార్తయగును.

చ. తలిసిడిగాన జావునకు దప్పితిగాకిది వేఁటపంతమా
యబ్బురపుం దెరంగున బరాట వికాయత చాపవల్లరీ
నిబిడ శరాహతం బగుననే చరజంతువు నొక్కఁడీగతిం
శబము పయిన్ని గుద్చునె నిశాతశిలీముఖ మెట్టి వెఱ్రివో.

ఉ. జోలున వర్షముల్ గుటియు సువ్రతుఁడౌ చిరుతుండనంబిదై
వాతెడుభక్తిపెట్టు శివభక్తుల కర్థి జతుర్విధాన్నముల్
తాలనియొల్చు పప్పును ఘృతంబును తీయని పానకంబులున్
జాలులుపిండివంటలును శర్కరయున్ దధియున్ యథేచ్ఛగన్.

## శివరాత్రి మహాత్మ్యం

సీ. హృదయ ముప్పొశ్వార నేకాంతమునసుండి
వాని చింతింపని వనిజముఖియు
నొకమారతనుజూచి, యొండొక్క మరిజూడ
నభిలషింపని విద్రుమాధరియును
గలలోనవాని జక్కగ గౌగిటనుజేర్చి
ముకిళితేక్షణగాని ముద్దియయును
నతనిరూపుంబ గుడ్యంబులందు లిఖించి
యందంబు జూడని యంగనయును

గీ. జెలులనుతను బ్రోదిరా చిలుకచేత
వానిగుణములు విని కుచద్వంద్వసీమ
బారుకోంబుల కింపని పైదలియును
బన్నిదము వేసినను లేదు పట్టణమున.

మ. వసుధా నిర్జరుడుఁ మహాసరసిలో వార్వీచులందేలెఁదా
వెసుధా సన్నిభమైన వారిదటపుఁ దీవ్వజావళిచ్ఛాయల్
వసియించెఁ లహరీ సమీరముల నధ్వశ్రాంతి పోకార్చిపెన్
బినకాండంబులు మేనఁగూరెజలు వల్మీరోక్మక సంకాశమున్.

శా. బింబోష్ఠి కుచకుంభభారము లురఃపీఠంబునన్ హత్తిమో
దంబారన్మృదు కేళిశయ్యల శుభాంతర్గ గేహంబులుం
దంబూలీదళభాగపూరితముఖుల్ ధన్యాత్మకుల్మీతకా
లంబెం తేనియు నిద్రవోదురు నిశల్ సంభోగ నీలావధిన్.

ఉ. బుద్ధియ కల్గెనేని కొనిపోకుడు ధర్మసూక్ష్మము మీయస్మ
బద్ధములైన న్యాయములఁ బంతము వచ్చునె మేముతెంపు
యుద్ధము జేయఁజాలక యమోహరిసాహరి యెంతజెప్పినం
నిద్ధరణీతలామరుని నీరు లలంబున మీఁకు దక్కునే ?

## కా శీ ఖ ం డ ము

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజియింపవు
నిద్రింపకయ మున్న నిద్రవోవు
నాథుండు మేలుకొన మున్నె మేల్కాంతు
కైసేయ కెన్నడు గవయవధివు
ధవుడు కోపితుడైన తఱి వాడియుందువు
పతికి నెప్పుడు మారు పలుకవీవు
పురుషునీగికి నల్పమనక సంతోషింతు
మొగ మెత్తనేరవు మగనియెదుర

గీ. తెరగు మాసిన యున్నొప్పు నిగ్గుతోడ
బతివిలోకన మార్గంబు పరిహరించి
పవిత్రుఁ డుదయింపనున్నొప్పు నలకమాడి
చూడవెవ్వారి పురుషుని బోటి కాని.

ఉ. దూరముపోయి యెంతపడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాట గేహళిలదాక నెదుర్కొని తీర్థమార్చి యా
హారము బెట్టి పీఠ్యము సమర్పణఁజేసి విహారశయ్యపై
నూరుపులార్చి చిత్తమున నుబ్బొనరించుట ధర్మమింతికిన్.

భీమఖండము

ఉ. వాలికచూపు మత్త పనటద్విలి కీలొనిపు రాస్వలలరై
వ్రాలిచి పచ్చకప్పురపు వాసనతోడి ముఖారవింద తాం
బూలము మోవి మోవిపయి మోపుచు రాధికకిచ్చు ధూర్త గో
పాలుఁడు బ్రోచుగావుత సపార కృపామతి మంత్రి యన్ననిన్.

శా. తల్లీ! యిన్నిదినాలకేనియు సుధాధారాలవస్యందియై
యుల్లంబున్ దనియింపఁజేయు పలుకెల్లో వింటిని వీటిలోఁ
బెల్లాకొన్నకతాన నేనొకఁడనే భిక్షానకున్వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునో నిజం బేర్పాటుగాఁబల్కుమీ.

ఉ. జాదుర జాదురంచు మృదు చర్చలు గీతలు వారుణీ రసా
స్వాదమదాతిరేకమునఁ జంద్రిక గాయఁగ దక్షవాటిలో
వీథుల వీ... నఁగ వీణలు మీటుచుఁ బాడిరచ్చరల్
మోదమ... గ ...న మోహన విగ్రహు భీమనాథునిన్.

...పూర్ణము.

గీ. వెరగు మానిన మూన్నాళ్ళ పిగ్గ తోడ
బతివిలోకన మార్గంబు పరిహరించి
పవిత్రుఁ డుదయింపనన్నాళ్ళు బలకమాడి
చూడవెవ్వారి పురుషుని బూవి లోని.

ఉ. దూరముపోయి యొండపడి దూపెతివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాట గేహళిబడాక నెదుర్కొని తీర్థమార్చి యా
హారముపెట్టి వీడ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరుపులొత్తి చిత్తమున నుబ్బానరించుట ధర్మ మింతికిన్.

భీ మ ఖ ం డ ము

ఉ. వాలికెచూపు మత్త పనబల్కి కిళోంచపు బాస్యలీలలై
వ్రాలిచి పచ్చకప్పురపు వాసనతోడి సుగంధవింద తాం
బూలము మోవి మోవిపయి మోపుచు రాధికకిచ్చు ధూర్త గో
పాలుఁడు బ్రోచుగావుత నపార కృపామతి మంత్రి యన్ననిన్.

శా. తల్లీ! యిన్నిదినాలకేనియు సుధా ధారాలవస్యందియై
యుల్లంబున్ దనియింపఁజేయు పలు కెట్లో వింటిని వీటిలోఁ
బెల్లాకొన్నకతాన సేనొకఁడనే భిక్షానకున్వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునొనిజం బేర్పాటుగాఁబల్కుమీ

ఉ. జాదుర జాదురంచు మృదు చర్చలు గీతలు వారుణీ రసా
స్వాదమదాతిరేకమునఁ జంద్రిక గాయఁగ దక్షవాటిలో
వీథుల వీ[illegible]నఁగ వీణలు మీటుచుఁ బాడిరచ్చరల్
మో[illegible]న మోహన విగ్రహు భీమనాథునిన్.

[illegible] పూ ర్ణ ము.